# గణపతి '75

రంగ్రావ్




అమెరికా వెళ్ళి ఎవరైనా ప్లాస్టిక్ సర్జన్ని కలుస్తా నంటున్నాడండీ.. అబ్బాయి...


అడ్డమైన తిళ్ళూ తిని ఏదో ఒకటి తెచ్చుకుంటాడు... డాక్టరు ఫీజులు కట్టలేక చస్తున్నా...!


ఇండియా వెళ్తున్నవా...నాయనా?
.. జాగ్రత్త! నీ బొజ్జ గట్రా చూసారంటే నిన్నో సంఘవ్యతిరేక శక్తిగా జమకట్టేసి....
'మీసా' ప్ర ప్రయోగం చేయగలరు!


నిన్ను చూసి కాదు లేవోయ్ ఆర్యభట్టుని చూసి నవ్వుతున్నా!
rangrao






ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)
శుక్రవారం : 12–9–'75
రాక్షసనామ సం. భాద్రపదమాస శు. అష్టమి
సంపుటము : 69 సంచిక : 1
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
★
సంవత్సర చందా – రు. 33-80
ఆరుమాసాల చందా – రు. 16-90
విడిప్రతి వెల 60 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003

## విషయసూచిక

ముఖచిత్రం:
విఘ్నేశ్వరుడు
(చిత్రకారుడు: ... గొలిశెట్టి)

కథలు:



సీరియల్ కథలు :



వ్యాసాలు, శీర్షికలు :

## ఏ పైరుకైనా
## సక్రమమైన పోషణకు-సమృద్ధియైన పంటలకు
# సుఫల 15:15:15 + యూరియా













మార్కెటింగ్ విభాగము

**ది ఫెర్టిలైజర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లి.**

(కేంద్ర ప్రభుత్వ యాజమాన్య సంస్థ)

ఆంధ్ర ప్రదేశ్ రీజనల్ ఆఫీస్

5-10-173 ఫతేమైదాన్ రోడ్ హైదరాబాద్-500 004




Kiron-FCI-1

## మనలో మాట

68 సంవత్సరాల క్రితం గణపతి నవరాత్రులలోనే ఆంధ్ర సచిత్ర వారపత్రిక వెలువడటం ప్రారంభమైంది. అందుకనే అందరికి యెంతో యిష్టమైన వినాయక చవితి పండుగ, ఆంధ్రసచిత్ర వారపత్రికకి పుట్టినరోజు పండుగ కూడాను. వినాయక చవితికి హాస్య సంచికగా ఆంధ్రసచిత్రవారపత్రిక వెలువడటం ప్రారంభమైనదాదిగా, తెనుగు దేశంలోని కార్టూనిస్టులంతా యిది ఒక 'పెట్టని పోటీ'గా భావించి మా కార్యాలయం మీద తమ వ్యంగ్య చిత్రాలను గుప్పిస్తూ వచ్చారు. ఈ ఏడు కూడా ఎంతో మంచి కార్టూన్‌లు వచ్చాయి. అన్నింటిని వాడటానికి చోటు చాలకపోవడం ఒక్కటే ముఖ్యమయిన కారణం. అడగక మునుపే ఉత్సాహంతో కార్టూన్‌లు పంపిన వ్యంగ్య చిత్రకారులకు మా కృతజ్ఞత. మా పాఠకులకు, రచయితలకు, వ్యాపార ప్రకటనకర్తలకు, ఏజెంట్లకు అందరికి వినాయక చవితి పండుగ శుభాకాంక్షలు. చోటుచాలకపోడం కారణంగానే 'ఎవరిది మోసం' కథ, కొన్ని మామూలు శీర్షికలు పైవారానికి నిలిచిపోయాయి.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళికి పెట్టిన సీరియల్ కథలపోటీ గడువు యీనెల 16వ తేదీతో అయిపోతుంది. ఏటా, వినాయక చవితినాటికే పోటీకి రచనలు పంపే తేదీ ముగిసిపోతూ వుండేది కాని యీసారి సీరియల్ కథల పోటీ కనుక చవితి వెళ్లిన మరి వారం రోజులుదాకా గడువు కొనసాగుతున్నది!

## గణపతులెందరు?

శివునికీ, కేశవునికీ ఎన్నో పేర్లున్నాయి. కాని వారి స్వరూపంలో మార్పులేదు. వినాయకుడికి ఎన్నో పేర్లు, వారిలాగే ఉన్నవి. స్వరూపంలో కూడా భేదాలు కానవస్తాయి. ఈ విధంగా మనకు ఒక్క వినాయకుడు కాదు, ఎందరో ఉన్నారు.

విఘ్నేశ్వరుడు మంచివారికి మంచిని, చెడ్డవారికి చెడుగునూ కలిగిస్తాడు. పాపాత్ములకు రోగాలు కలిగించడానికి చతుర్విధ వినాయకులు ఉన్నట్లు యాజ్ఞవల్క్య స్మృతివల్ల తెలుస్తున్నది.

గణపతి భక్తులు గాణాపత్యులు అతనిని పూజించేవారు. కాని, కాలక్రమాన అభిప్రాయ భేదాలేర్పడి వారు ఆరు విధాలుగా చీలి పోయారు. వేరుపడిపోవడంతో ఊరుకోక వారు తమ దైవమైన గణపతిని కూడా ఆరు



విధాలుగా మార్చివేశారు. మహా గణపతి, హరిద్రా గణపతి, ఉచ్ఛిష్ట గణపతి, నవనీత గణపతి, స్వర్ణగణపతి, సంతాన గణపతి అని ఆ ఆర్గురు గణపతుల పేర్లు. ఈ విధంగా

(46వ పేజీ చూడండి)

# వినాయకుని వాహనం నెమలియా?

గణపతి ఉపాసకులలో గొప్పవాడైన ముద్గల మహర్షి పేరిట సూతునిచే చెప్పబడినది ముద్గల పురాణం. ఇందులో 428 అధ్యాయాలు గల 9 ఖండాలు ఉన్నాయి. విఘ్నేశ్వరుని వర్ణనతో కూడిన ఈ పురాణంలో మొదట ఎనిమిది ఖండాలలో, ప్రసిద్ధమైన 8 కథలు ఉన్నాయి. మొదటి ఖండంలో 54 అధ్యాయాలు ఉన్నాయి. సృష్టి రచనలో విఘ్నేశ్వరుడు సహాయపడిన విధం, ఎంద దేవతల సృష్టి. మత్సరాసుర వధ, వినాయకుని కృపవల్ల విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అగుట, షడక్షర మంత్ర వర్ణన ఇందులో ఉన్నాయి.

48 అధ్యాయాలు గల రెండవ ఖండంలో ఏకదంతుని అవతార లీలలు, మధుకైటభుల సంహారం, మదాసుర వధ, అగస్త్యుడు, కపిలాది మహర్షుల వర్ణనలు ఉన్నాయి.

మూడవ ఖండం 51 అధ్యాయాలతో కూడి ఉంది. గణేశుని మహోదర అవతార లీలలు, మోహాసుర వృత్తాంతం, నరనారాయణులు, మాంధాత, అంబరీషుడు, సగర, భగీరథుల వర్ణనలు, శ్రీరాముని అవతార వృత్తాంతము, శ్రీరామునికి పరమశివుడు శ్రీ గణేశుని తత్వమును బోధించుట. రావణాసుర వధ మొదలైన విషయాలు ఉన్నాయి.

78 అధ్యాయాలలో ఉన్న నాలుగవ ఖండంలో గజానన అవతార లీలలు, లోభాసుర సంహారం, దశరథునికి వశిష్ఠుడు గణేశ లీలలు తెలుపుట, సంకష్ట చతుర్థి వ్రత విధానం సవిస్తరంగా చెప్పబడింది

ఐదవ ఖండంలో నలభైయైదు అధ్యాయాలు ఉన్నాయి. లంబోదరుని అవతార లీలలు, విష్ణువు మోహినీ అవతారము, క్రోధాసుర జననం సంహారము, మహిషాసుర వధ, గణేశునిచే మానస బ్రహ్మపూజ జరుపుట మొదలైన వర్ణనలిందులో ఉంవు

ఆరవ ఖండం కూడా 45 అధ్యాయాలతో కూడి ఉంది. వికట రూప అవతారములు, కామాసుర వధ ఇందులో ఉన్నాయి. ఈ అవతారములో వినాయకుని వాహనంగా నెమలి ఉందట!

ఏడవ ఖండంలో 16 అధ్యాయాలు ఉన్నాయి. ఇందులో విఘ్నరాజ అవతారములు, మమాసుర వధ, దత్తాత్రేయుని ద్వారా గణేశ తత్వ వర్ణనలు ఉన్నాయి.

50 అధ్యాయాలు గల 8వ ఖండంలో గణేశుని ధూమ్రవర్ణ అవతార లీలలు, వజ్ర పంజరిక స్తోత్రమును గణేశుని ద్వారా శివునికి ఉపదేశించుట, ప్రతి నెలలోనూ గణేశుని ఉపాసించే విధానం, గణేశ భక్తుడు శ్రీవల్లాల వర్ణన మొదలైనవి ఉన్నాయి.

తొమ్మిదవ ఖండంలో 41 అధ్యాయాలువున్నాయి. ఇది పూర్ణ యోగదాయకము. అష్ట వినాయక వర్ణనలు శ్రవణఫలము మొదలైనవి వివరంగా వర్ణింపబడినవి. అంతేకాక యోగ గీత 12 అధ్యాయాలు గల 989 శ్లోకాలతో వర్ణించడం జరిగింది ఈ ఖండంలో.

సమస్త చరాచర విశ్వము గణేశమయమని, ఆయన కీర్తన పరమ శ్రేయస్కరమని ఈ పురాణములో వర్ణించబడినది గణేశ ఉపాసకులకే కాక మొత్తం హిందువులందరికీ ఈ ముద్గల పురాణము కల్పతరువు

సేకరణ : ఇటిక్యాల మాణయ్య



"వేన్ను ప్రాణాలకింత శంక నంటెడు
గజాస్యుని కొల్తు నభీష్టసిద్ధికై"
(చిత్రకారుడు : దర్శన్)



# చలపతి

తాటవర్తి

*"ఏ(వోయ్ చలపతీ! కొంచెం ఇటొస్తావా?" అని అడిగాడు గుమస్తా కాంతారావు.*

"ఏం కావాలో సెప్పండీ!" టైపిస్టు వీర్రాజుతో బాతాఖానీ కొడుతున్న చలపతి అక్కడ్నించి అంగుళమయినా ఇటు కదల కుండా అడిగాడు.

"ఏంలేదు! కొంచెం ఈ ఫైలు 'ఇ' సెక్షనులో సూపరిండెంట్ గారికిచ్చి వస్తావా?"

"ఇద్దాంలెండి! అక్కడుంచండి.."

"మరి అర్జంటోయ్! మేనేజరుగారు ఇందాకనే అడిగారు కూడాను." బ్రతిమాలు తున్నట్టే ధ్వనించాడు కాంతారావు.

"నాకిప్పుడు తీరిగ్గా లేదండీ!" అని కాంతారావు వైపోసారి నిర్లక్ష్యంగా చూసి "...ఆ పోఁ య్యొస్తాడుగా — ఆడికివ్వండి. ఇంకా లరిజెంటయితే మీరే ఇచ్చెయ్యండి. నాకు వేరే పనుంది..." అని వీర్రాజువైపో నవ్వు విసిరి ఎటోపోయాడు చలపతి.

కాంతారావు తెల్లమొహం వేసాడు. 'అరి పీడి మొహం ఈడ్చ... అందరి ఎదురుగా ఎంత మాటన్నాడు!' అని లోలోపల గిలగిల లాడాడు. వెంటనే వెళ్లి హెడ్ గుమాస్తాగార్కి రిపోర్టిద్దామనుకొని కుర్చీలోంచి లేచాడు. అంతలో — రెండు నెల్ల క్రితం పెళ్ళాం పురిటి ఖర్చుకని (మారో మార్గం లేక) చలపతి దగ్గర అప్పుతీసుకొన్న రెండు వందల విషయం — చటుక్కున గుర్తు వచ్చింది... వెంటనే వెనక్కి కుర్చీలో కూల బడ్డాడు.

ఆ తర్వాత అరగంటకి ఎవరూ చూడ్డం లేదని పించినప్పుడు — తనే ఫైలు పట్టుకు వెళ్లి 'ఇ' సెక్షనులో ఇచ్చివచ్చాడు — 'వెర్రి బాగుల' కాంతారావు.

* * *

"ఏఁవోయ్ — చలపతీ! ఓచిన్న పని చేసి పెడతావ్?" అని అడిగాడు కేషియరు కేశవ రావు.

"ఏంటేంటండి అంత సిన్నపని! కాపీ గీపీ కావాలంటే నేనిప్పుడందూరంఎల్నేనండి!"

"అబ్బే, నా సొంతపన్లేమీ కావులే! ఆఫీసు పనే!" అన్నాడు నవ్వు తెచ్చి పెట్టుకుంటూ.

"ఉహూఁ! ఇప్పుడు నాకు బొత్తిగా తీరిగ్గా లేదండీ!"

"అదేంటోయ్! ఈ కేష్ బాక్సు, పుస్త కాలు కొంచెం జీపులో పెట్టిపెట్టలేవా? ఈ మాత్రం దానికి..." పాపం, సాధ్యమయి నంత మార్దవంగానే పలికాడు కేశవరావు.

"అదేనండీ నాన్సెప్పేదీను. ఈ పని కూడా నాకే సెప్పాలా? అందూరం బాంకుకి తీసు కెల్లగాలేన్ది కుసింత దూరం మోసుకెల్ల లేరేంటి! — ఏటో సెప్తారు..." అంటూ అదేపోత పోయాడు చలపతి!

కేశవరావు వెలవెలబోయాడు. 'అరి పీడి బండబడ — ఇంతమందిలో ఎంత మాట న్నాడు!' అని లోలోపల గిజగిజలాడాడు. వెంటనే హెడ్ గుమాస్తాగార్కి రిపోర్టిచ్చేద్దా మని అటు కదలబోయాడు అంతలో నెలక్రితం తమ్ముడు కాలేజీ ఫీజుల ఖర్చుల కోసం — తండ్రి ఉత్తరం వ్రాసినప్పుడు



(తనకు తప్పనిసరియై) చలపతి దగ్గర్నుంచి అప్పు తీసుకొన్న మూడు వందల సంగతి గబుక్కున జ్ఞాపకం వచ్చింది!

తన పరిస్థితి గమనించి తన ముఖంమీదే వివరయినా నవ్వుతారేమో అన్న భయంతో— తలదించుకొని జీపు దగ్గరికి ఆ సామాను తానే మోసుకుపోయాడు 'ఫూల్ ఫెలో' కేశవరావు.

* * *

"చూడు చలపతీ! ఓకప్పు స్ట్రాంగ్ కాఫీ తెచ్చి పెడలావ్!..." అని నవ్వుతూనే అడిగాడు హెడ్‌గుమస్తా వెంకట్రావు.

"ఇందాకనే సెప్పాపేయారా! ఇప్పాడం దూరం ఎవరెల్తగల్రు? కాళ్ళు పీక్కుపోతున్నాయ్! ఆపీసులో రూము రూముకి తిర్గలేక సచ్చిపోతున్నాను!"

"అస్తమానం నేనేదో పనులు చెప్పినట్టు ఇదవుతావేమిటోయ్!... పైగా నేనడగటం కొత్తా—నువ్వుచెయ్యటం కొత్తా?"

"అదే సార్ నానవేదీను—సేత్తున్నాకాబట్టే ఇంకా సెప్పకుంటూ పోతున్నారు."

నిర్ఘాంతపోయాడు వెంకట్రావు. 'ఓరి పీకి అసాధ్యం కూల—పైఉద్యోగి అనయినా ఖాతరులేకుండా ఎంతలేసి మాటలంటున్నాడు! పీడికో 'మెమో' ఇచ్చి రోగం కుదర్చాలి—' అని లోలోపల అనుకుంటూ ముందుపైపైన బెదిరిద్దామనుకున్నాడు. అంతలో—నెలరోజుల నాడు కూతురు భర్తతోసహా పండగకని వచ్చి నప్పుడు (అత్యవసరమై) చలపతి దగ్గర్నించి అప్పుతీసుకున్న ఐదువందలమాట హఠాత్తుగా సర్తుకొచ్చింది!

"తెగలిగితే తే! లేకపోతేలేదు—అన్నిమాట లెందుకు?" అనిమాత్రం ఎలాగో అన్నాడు.

చలపతి మరోసారి నిర్లక్ష్యంగా చూసి ఇంకెటో పోయాడు. ఈ మాటలు విన్నవాళ్లెవరయినా తనవైపు చూసి నవ్వుకుంటారేమో — అన్న కంగారుతో తలకాయి ఫైళ్ళలో దూర్చాడు 'పాపం' వెంకట్రావు!

* * *

బాధితులు ముగ్గురూ ఎవ్వరిమట్టుకు వాళ్ళు చలపతికి ఎలా బుద్ధి చెప్పాలా అన్న ఆలోచనలతో రోజంతా వేగిపోయారు.

కేశవరావు కాఫీ త్రాగి బుర్రవేడి తగ్గించుకుందామని కేంటీన్‌కివెళ్ళి ఓపక్కగా కూర్చోబోయాడు. అక్కడ ఒక్కడు బిక్కమొహం వేసుకూర్చున్న కాంతారావు కనిపించాడు.

ఎవరెవర్ని పలకరించారన్నది అప్రస్తుతం... ఎవరు చలపతి వ్యవహారం ముందు పైకి చెప్పుకున్నారన్నదీ మనకనవసరం. అయితే, ఇంతసేపు సొంత సమస్యగా పరిగణించుకొని ఆలోచిస్తున్న ఇద్దరూ—ఐదు నిమిషాల్లో 'చలపతి పొగరెలా అణచాలి'! అన్న ఉమ్మడి సమస్యను గురించి చర్చించుకోవటంలోకి దిగారని తెల్సుకుంటే చాలు!"

కాఫీ గ్లాసులు ఖాళీ అయ్యేసరికి ఓ పరిష్కార మార్గం దొరికింది. ఇద్దరూ కల్సి హెడ్ గుమాస్తాగార్కి ముందు 'ఓరల్'గా రిపోర్టిద్దామని— ఆ తర్వాత ఆయనేంచేయమంటే అది చేద్దామని నిశ్చయించుకున్నారు.

తేటపడిన ముఖాలతో బయటకు వస్తున్న వీళ్లకి హెడ్‌గుమాస్తా 'వెంకట్రావు' గారి దర్శనం కేంటీన్ గడపలోనే అయింది. ఇద్దరూ కళ్లతోనే 'కన్సల్ట్' చేసుకొని ఆయన్ని గౌరవంగా లోపలికి ఆహ్వానించి మళ్లీ కాఫీ తెప్పించారు. వెంకట్రావు కాఫీ త్రాగాక 'ఏమిటి విశేషాల'ని అడక్కముందే అసలుసంగతి ఏక కంఠంతో ఏకరవు పెట్టారు.

అంతవరకు సీరియస్‌గా ఆలోచనల్లో




పడివున్న వెంకట్రావు వాళ్ల రిపోర్టు విన్నాక నవ్వకుండ ఉండలేకపోయాడు. "రోలెళ్ళి మద్దెలతో మొర పెట్టుకున్నట్టుంది! ... నాకూ వాడు కొరకరాని కొయ్య అయిపోయాడు..." అని జరిగింది చెప్పాడు.

"అదేమిటిసార్! ప్యూను వెధవకి అంత టెక్కేమిటి? అటు మేం ఫరమాయించిన ఆఫీసు పని మానేస్తే మానేసాడులెండి. కనీసం అమూల్యమైన మీ కాలం వృధా కాకుండా మీక్కాఫీ తెచ్చిపెట్టడంలో వాడి సొమ్మేంపోయింది?" అని కాంతరావు అన్నాడు కొంచెం 'కాకా' ధోరణిలో.

"ఈ వేళ ఇంతటితో సరిపెట్టాడు. రేపు మీరాఫీసు పని చెప్పినా చేయనగలడు సార్! మరి వీడెందు కిక్కడున్నది!" అని కేశవరావు తన పోర్శను వల్లెవేసాడు.

అయితే, లోక వ్యవహారం వీళ్ళకన్న బాగా జీర్ణించుకున్న వెంకట్రావు తొణక్కుండానే "ఏమనుకోనంటే మిమ్మల్నోమాట అడగాలనుకుంటున్నా" నన్నాడు

"అదేమిటి సార్! మీరడగటమూ! మేమేదో అనుకోవటమూ?" అన్నాడు కాంతారావు మరింత వినయంగా.

"అడగండి. ఏమడిగినా చెప్తాము." అన్నాడు కేశవరావు ఆజ్ఞాను వర్తిలా.

"మీరు వాడి దగ్గరేమయినా డబ్బు తీసుకున్నారా?"

ఇద్దరూ ఉలిక్కిపడి ముఖాముఖాలు చూసుకున్నారు.

"నేను అత్యవసరంగా రెండొందలు తీసుకున్నానండీ!" అన్నాడు కాంతారావు సిగ్గుతో ముడుచుకుపోతూ.






నీకు తోడుగా నేనూ ఉన్నాలే. మరేం బాధపడక''న్నట్లు – ''నాకూ అవసరం వచ్చి మూడువందలు పుచ్చుకున్నాను సార్!'' అన్నాడు కేశవరావు.

## చ ల ప తి

''ఆశ్చర్యంగా ఉంది! మీరెలా ఊహించారుసార్!'' కాంతారావు 'కాకా' పారం వదల్లేదు.

వెంకట్రావు నవ్వులో విషాదం తొంగి చూసింది. '' ... నేనూ తీసుకున్నానయ్యా వాడిదగ్గర ఐదువందలు. అందుకనేగా గట్టిగా వాడిని నిలదీయ లేకపోయింది !''

''మరయితే, వాడిని దారిలోకి తెచ్చేదెలా ? అని వాళ్లిద్దరూ ఏక కంఠంతో అడిగారు.

ఓ క్షణం ఆలోచించాడు వెంకట్రావు. ''వాడికి మనం అప్పున్నంతకాలం మన చెప్పుచేతల్లో వాడుండడు. వాడిని నిలదీసి అడగటానికి మనకే జంకుగానే ఉంటుంది. ఏ క్షణంలోనయినా వాడు డబ్బు గురించి నలుగురి ముందూ ఎత్తాడంటే మన పరువు పోతుంది. మనం ఎలాగోలా తీర్చేస్తే అప్పుడు ఏంచేసినా ఫలితం ఉంటుంది !''

నిజమేనన్నారు వాళ్లిద్దరూ.

''అయితే, ఎప్పట్లోగా మీరు తెచ్చివ్వగలరు ?''

''ఓ వారంలో ఏదో ఒకటి అమ్మయినా సరే, డబ్బు తెచ్చి వాడి ముఖాన పడేస్తాను సార్ !'' అన్నాడు కాంతారావు పౌరుషంగా.

''నేనూ అంతేసార్ ! అప్పటిక్కాని నాకు నిద్రపట్టదు.'' అన్నాడు కేశవరావు వంత పాడుతూ.

'అయితే మంచిదే ! మీరు ఇచ్చిన వెంటనే చెప్పండి. ఈలోగా నా ప్రయత్నం నేనూ చేస్తాను'' అన్నాడు వెంకట్రావు.

* * *

వారం పూర్తి కాలేదు—

కాంతారావు వెండి కంచం అమ్మేసి రెండు వందలు తెచ్చి వాటికి చేతిలో ఉన్న పాతిక వడ్డీగా కలిపి మొత్తం చలపతి ముఖాన కొట్టాడు!

కేశవరావు కొంత సొమ్ము మరో చోట వడ్డీకి అప్పుతీసుకొని — మరికొన్ని చేబదుళ్లు చేసి అసలీఫాయిదాలు మొత్తం మూడు వందల ముప్ఫయి రూపాయలు తెచ్చి చలపతి ఒళ్లో పడేసి — ఇంకెప్పుడయినా వాడి దగ్గర అప్పు తీసుకుంటే ఒట్టనికూడా చెప్పాడు!

ఇక మంగళసూత్రం మినహాగా భార్య నగలన్నీ మార్వాడీ కొట్లో తాకట్టుపెట్టి ఇవ్వాల్సిన ఐదువందల నలభై రూపాయిలు చలపతి చేతుల్లో పెట్టి — 'డబ్బు మరోసారి బాగా లెక్కచూసుకో చలపతీ' అని సన్న సన్నగా చివాట్లు పెట్టాడు వెంకట్రామయ్య.

'అవకాశం వస్తే చలపతి చవడాలెక్కతీయటమే తరువాయి' అనుకున్నారు - ముగ్గురూ. ఇక తమఆజ్ఞ పాటించక ఎక్కడికిపోతాడులే- అని సమాధాన పడ్డారు.

ఆఫీసన్నాక వ్యాసంగం పనిలేనిదెవరికి? వాళ్లకు మరునాడే ఆ సందర్భాలు రానే వచ్చాయి

కాంతారావు ఫైలిచ్చి 'సి' సెక్షనులో ఇచ్చి రమ్మన్నప్పుడు — చలపతి వచ్చినట్లు ఇచ్చి వస్తాడనుకున్నాడు. కాని, చలపతి జవాబు 'డిటో'—కాంతారావుకి చిర్రెత్తుకు వచ్చింది!

ఈమాటు జీపు దాకా కేష్ బాక్స్ తెచ్చి పెట్టమని కొంచెం అథార్టీగానే చెప్పాడు కేశవరావు. వినిపించుకోనట్లే పోయాడు చలపతి — జవాబివ్వటం కూడా దండుగన్నంత 'కేర్లెస్'గా - కేశవరావుకి పీకమునగ కోపం ముంచుకొచ్చింది!

ఆఫీసుకు వస్తూనే కాఫీ తీసుకురమ్మన్నాడు వెంకట్రావు — తెస్తానండి అని పోయాడేకాని చలపతి మళ్లీ పత్తాలేడు గంటపోయాక మళ్లీ కనిపించినప్పు డడిగితే — తనకిదే పనేనంటన్నట్లు మాట్లాడాడు—ఒళ్లు మండిపోయింది వెంకట్రావుకి.

అదే సమయానికి తక్కిన 'బాధితులు' కూడా వచ్చి పడ్డారు - అప్పు తీర్చినా చలపతి ప్రవర్తనలో మార్పేం కనిపించలేదని- వాడి 'ఇన్‌సబార్డినేషన్' తామిక భరించలేమని గోలపెట్టారు.

అంతకుముందే స్వానుభవమయిందేమో — వాళ్లని విడివిడిగా ఘాటుగా రిపోర్టులు వ్రాసి పట్టుకురమ్మన్నాడు వెంకట్రావు. వాళ్లవి తెచ్చాక వాటిలోని సంగతులు జోడించి తనొకటి మరీ ఘాటుగా వ్రాసి ఇవన్నీ కట్టకట్టు

(42 వ పేజీ చూడండి)



స్వామీ ? మా ప్రక్కింటి కాలేజీ బ్యాచ్ నీలాంటి మొగుణ్ని, నాకు నీ తమ్ముడు లాంటి వరుణ్ని యిప్పు వంద గుంజీలు తీస్తా . . . .

# వారఫలం

—మహేష్

## 12-9-1975 శుక్రవారం మొదలు 18-9-1975 గురువారం వరకు

**మేషం—:** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— దైవ కార్యాలు నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం:—** ప్రయోజనం లేని శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**మిథునం:—** రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వారం మధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ఆందోళన కలుగుతుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**కర్కాటకం:—** ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి వారం మధ్యలో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు.

**సింహం :—** మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో పోటీవారి పోటీ పెరుగుతుంది. భవిష్యత్తులో బాధ్యతలను కలిగించే వాగ్దానాలు చేయడం తగదు. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది. స్త్రీలకు— పుణ్య కార్యాలు చేస్తారు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కన్య :—** ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణాలు వాయిదా పడతాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**తుల:—** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు—సంతోషకరమైన వార్తలను వింటారు. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృశ్చికం :—** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వ్యాపారంలో అనుకూలమైన వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**ధనుస్సు :—** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. పోటీ వారిలో గౌరవం బాగుంటుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. ప్రయాణాలు ఫలించగలవు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం :—** ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలించగలవు. నూతనవ్యవహారాలు లాభిస్తాయి స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**కుంభం :—** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. విలువైన వస్తువులు పోవచ్చును. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది నూతన విషయాలను తెలుసుకొంటారు.

**మీనం—:** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది ప్రయోజనం గల పరిచయాలుఏర్పడతాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. సాహసిక వ్యవహారాలుబాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యంబాగుంటుంది సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.




# మేము గడువు కాలము తీరిన పాలసీల తాలూకు 4,000 మందికి పైగా చెల్లించ లేక పోతున్నాం... ఎందువలనంటే మాకు వారి ప్రస్తుత అడ్రసులు తెలియవు!

## వారిలో మీరూ ఒకరా?

అది నిజంగా నమ్మటం కష్టం. అయినా వాస్తవం—చాలా మంది ప్రజలకు వారికి ఎల్ఐసి నుంచి డబ్బు రావాలన్న విషయం గూర్చి తెలియదు. లేక మరచి పోయారో ఎందువలన?

వారు ప్రథమంగా ఇచ్చిన చిరునామా నుంచి మారారు కాని ఎల్ఐసికి తెలుపలేదు అందువలనవారికి ఎల్ఐసి పంపిన ఇంటిమేషన్ ఫారం మరియు డిస్చార్జ్ వొచరు అందలేదు.

మీకు కూడా అలాంటి పాలసీ ఉన్నదా? సరిచూడండి.

● మీ పాలసీ గడువు తీరు తేది ఏది? ● తేది దాటితే, మీ పాలసీ చివరిసారి సర్వీసు చేయబడిన ఎల్ఐసి ఆఫీసుకు పాలసీ వివరాలను పంపండి. మీ ప్రస్తుతపు చిరునామాను కూడా ఇవ్వండి ● పాలసీ అమలులో ఉన్నదంటే అర్థం దాని తాలూకు ప్రిమియములన్నీ చెల్లింపబడినది ● పెయిడ్ అప్ పాలసీ అంటే దానిపై ప్రిమియముల కనీస కాలం, రెండు లేక మూడు సంవత్సరాలు చెల్లింపబడినవి.

**పెయిడ్ అప్ పాలసీ మీద మీకు ఎంత లభిస్తుంది?**

దాహాషా మొత్తం ఉదా—20 సంవత్సరాల పాలసీ రూ. 10,000 దానిపై మీరు 5 సంవత్సరములు ప్రిమియంతో కడితే మీకు సుమారు, రూ. 2,500 రావాలి (1956కు ముందు వివిధ ఇన్సూరెన్సు కంపెనీలచే ఇవ్వబడిన పాలసీలకు వేరు వేరు రేట్లు గలవు.)

క్లెయిము చేయవలసినవి మొత్తం రూ. 44 లక్షలు ఉన్నాయి. 2648 పెయిడ్ అప్ పాలసీలు.....విలువ రూ. 18.50 లక్షలు. 1386 అమలులో ఉన్న పాలసీలు...విలువ... రూ. 25.12 లక్షలు.

మీ సందేహాలకు, మీ ఏజంటును లేక సమీపంలోని ఎల్ఐసి ఆఫీసును సమాచారం కోసం సంప్రదించండి.

### మీకు అధిక సేవ చేయుటలో మాకు తోడ్పడండి.




## లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

# మినీ ఇంటర్వ్యూ




చిరంజీవి విఘ్నేశ్వరరావుగారూ! నీకు ఇష్టమైన పదార్థాలేమిటి? అంటే "కల్తీలేని ఉండ్రాళ్ళూ, మరీ బక్కచిక్కినవి కాకుండా కాస్త వో మోస్తరుగా వుండే కుడుములూ, మరిగంటే "జిల్లేడుకాయలూ", అరటిపళ్ళూ ......కొబ్బరి బొండాలూ......" అంటూ సాగదీస్తున్నాడు...... "అయ్యా! బొజ్జ గణపయ్యా" అలా అలా తిండి కబుర్లు చెబుతూంటే ఎలాగా? మరి చదువులకు దేవుడివి కదా ఆ అభిరుచులు కూడా చెపితే......" అంటూంటే అయ్యో రుచులు గురించి చెబుతూ వుంటే ఈ పెద్దమనిషి అభిరుచులమీద పడ్డాడేమా ? న్నట్లు తొండం మెలిక తిప్పి, ముక్కు పీల్చి... "ఉహూం... ఈ కాలపు ఎడ్యుకేషన్ నాకిష్టం లేదు. మరీ కో—ఎడ్యుకేషన్ ఎక్కువై పోయింది... కాలేజీల్లో ఇరుకు సీట్లు, కాలేజీ వెలుపల మురికి గల్లీలు, కిల్లీకొట్లో కారా కిల్లీలు, సినిమా పాటల పబ్లిసిటీ రోజులు—... ఈ గోల నేను భరించలేను... హాయిగా ఇంగ్లీషు పాఠమూ చెప్పరు, పూర్తిగా తెలుగు పాఠమూ వుండదు. అంతా చౌచౌ వ్యవహారం. అసలూ, ఈ ఎడ్యుకేషన్..."కథచాలాదూరం వెళ్తోందని "చూడు ఏకదంతంగారూ! నీకు ఫ్యాషన్‌ల మోజేమైనా వుందా!" అన్నాను. "ఓయస్ ? ఫ్యాషన్‌లదే ఈ యుగం...... చూడు ఏ బార్బరు షాపుకైనా వెళ్తే ఆ బార్బర్ కూడా జులపాలు పెంచుకుని వుంటున్నాడు. కనుక నేనూ మానాన్నగారి స్టయిల్లో హెయిర్ స్టయిల్ మార్చేస్తున్నాను. అసలు ఏనుగుకాళ్ళ ఫ్యాంట్ అంటే నా కిష్టం. అవి నాకోసమే చేయించారల్లేవుంది! సో ఐ లైక్ దెమ్... ఇక బెల్టు పెట్టుకోడం. ఈ బొజ్జమీద నుంచి గొట్టాం ఫ్యాంట్ జారి పోకుండా అవసరంకదా! 'మానాన్న మెళ్ళో పాములన్నీ నాబెల్టులే' నంటున్నాడు కార్టూనిస్టు 'జైదేవ్', నాకేమో బెల్‌బాటమ్స్ వేస్తున్నాడు బాబు!! సో...ఐ లైక్ దెమ్ అన్నమాటా? ! ఈ అమ్మాయి రాగతిపండరి మరీ అన్యాయంగా నన్ను ఎంతో లావుపాటి లేక వలంపాటి వాణ్ణి అని జోక్‌వేసి బాత్ రూమ్‌కి..."(బాబ్బాబూ ఆపుతావా?అనినేను మనసులో దుఃఖించి) "అద్సరే కార్టూనిస్టులంటే మూషిక వాహనా! నీకు కోపంగా వుందా?" అన్నాను— "వుహూం అదేం లేదు... కాని మరీ ఎలకని కూడా కాపాడుకో లేని వాణ్ణిగా నన్నువాళ్ళు చిత్రిస్తున్నా రంటేనూ... అంతేగాని ఈసారి ఆ "గీతా"

## మినీ ఇంటర్‌వ్యూ

పుణ్ణాడే- నామీద కార్టూనే వేయలేదు ...చూశావా? (వేస్తే వోగోలా? వేయక పోతే వో గోలానా?) అంటుంటే ఆ ఫీంకా రానికి అడ్డంపడి దేశంలో స్మగ్లింగ్ తగ్గడం మీద మీ అభిప్రాయం ఏమిటి? అన్నాను. "ఎంత తొందరగా తగ్గితే అంత బెటర్ కదా... నాకు తిండిపోతుతనం అంటగట్టకు కావి, భోజన ప్రియత్వం వుంది... ఆ సరదా కాస్తా తీరేఛాన్సు యిదేకదా!" అన్నాడుగణపతి.

సినిమాల గురించి కొంచెం చికాకు పడ్డాడు... "పార్వతీ పరమేశ్వరులు అర్ధనారీ శ్వరులు గనుక ఫర్వాలేదు కాని యీ తెరమీద హీరోబొమ్మ హీరోయిన్ బొమ్మ యిట్లా ఒకదాన్లోకి ఒకటి టెలిస్కోపయిపోయి, యీ సగం అటూ ఆ సగం యిటూ అతుక్కు పోడం... అమ్మమ్మ! దేవాలయాలమీద శృంగార శిల్పకళను మరపించే డ్యూయట్ పాటల "విడని బంధాల" ఆరుబయలు పడ గ్గది దృశ్యాలూ... అమ్మమ్మ!! యింత సెక్సు అప్పీల్ డోసా? భరించజాలవ్...." అంటూ ఆయాసపడుతూంటే ఇక లాభంలేదు అనుకుని "సరే! అంత బాగు న్నాయా? సినిమా బొమ్మలు? కుర్రాళ్ల కోసం కదూ వాళ్లు యివన్నీ తీస్తున్నారూ? అంటూ మాట మార్చాలనుకున్నాను. "మరే! అడ్డమైనవన్నీ చేయటం, అన్నీ యువతరం కోసం అనడం... నాన్సెన్స్ నేనన్నమ్మను! ఓ ఆటా? ఓ రిక్రియేషనా! యువతరానికి ఏముంది... అసలీ మాటలు సరేగాని సార్! ఓ మాట అడగనా?" అన్నాడు, పార్వతీ తన యుడు తొండం అదోలా వూపి. "ప్లీజ్! అడుగు స్వామీ? కుమారస్వామిని యువ తరంలోవేయమనా? అడుగుతావు?"అన్నాను. "అబ్బే! అదేంకాదూ... కొన్ని తెలుగు బైస్కోపు 'స్టిల్స్' లదే హీరో హీరో యిన్‌లు ప్రేమించుకుంటున్నవిస్తే దేవలోకం లోకి తీసికెళ్ళి రంభా, వూర్వశి, మేనకవాళ్లకి పడగ్గదుల్లో పెట్టుకోమని యిస్తాను...వాళ్ల ఫేవర్ నాకు ఎందుకనడక్కు... నా కెందుకు బ్రహ్మచారిగాణ్ణి అది కూడా కావాలనే కోరే భక్తులుంటారుగా... వాళ్లకోసం వీళ్లని కొంచెం... "అర్థం అయింది అర్థం అయింది స్వామీ! అవశ్యం" అంటూ "సరే యీసారి దేశంమీదకి ఫో స్వామీ నీకూ నీ బొజ్జకీ బెటర్ లక్!!" అన్నాను. -వీరాజీ

సీరియల్

# రాగవీచికలు

ఆదూరి వేంకట సీతారామమూర్తి

(గత సంచిక తరువాయి)

17

'వెధవకి తెలివి తేటలు రమ్మంటే ఎక్కణ్ణించి వస్తాయి ... కలిగిన కాడికి తినటం...దేశదిమ్మరిలా జులాయిగా తిరగటం .. ఎంత చేస్తేమాత్రం అబ్బ బుద్ధు లెక్క డికి పోతాయి...?' మాధవరావుగారి మాటలు వాసు చెవిన బడ్డాయి...ఒక ప్రక్క సిగ్గుతో దుఃఖంతో ఏడుస్తున్న వాసుకి తాతయ్య మాటలు వుక్రోషాన్ని కలిగించాయి.



## రాగ వీచికలు

'తాతయ్యా ... మా తెలివి తేటలేవో మాకున్నాయి గాని మా నాన్నగారిసేం మీర నక్కరలేదు...నా పరీక్ష ఎందుకు పోయిందో నాకు బాగా తెల్సు ...''

'తెల్సు...తెల్సు ... తెలియకేం ... రాత్రి పదింటివరకన్నా చదివినరోజు ఒక్కటేనా వుండియేడిస్తేగా...పాసవడానికి'

'అచ్చు పుస్తకాలు కొనేడిస్తేగా చదవ డానికి ? ఎప్పుడూ ఆ నోట్సులు చదువు కోడమే...నోట్సులు చదివి పరీక్షలు రాస్తే మార్కులెలా వస్తాయి...ఎలా పాసవుతాను.'

ఈసారి మాధవరావుగారు వుగ్రు లయ్యారు ...

''నోర్మూయ్యరా వెధవా ...నీ కసలు తిండి తిప్పలూ పెట్టకుండా మాడ్చేస్తేగాని చదువ బ్బదు ..మీ అన్న మిమ్మల్ని ఆఫీసర్లని చేసే ద్దామను కుంటున్నాడు ... మీరేమో తిన్న యింటివాసాలు లెక్కపెడుతూ మమ్మల్నే ఎదిరిస్తున్నారు ... మా వంశంలో లేవు యిలాంటి బుద్ధులు ... యేవి రాకూడదను కున్నామో అన్నీ దాపరించాయి అటుపక్క నుంచి.''

'తాతయ్యా అదే వద్దన్నాను. మాట్లాడితే మా నాన్నని తిడతావు ... మీ అందరి కంటె ఆయనేం తప్పుపని చేయలేదు...అనవసరంగా మా ముందు ఆడిపోసుకుంటే మాత్రం వూరుకునేది లేదు'

*జరిగినకథ : 7* చదువుకుని ఉద్యోగంచేసి కుటుంబాన్ని ఆదుకోవా లనే వుద్దేశ్యంతో విశాఖపట్నం వచ్చిన వర్ధనికి, రాజశేఖరం మామయ్య ప్రోత్సా హం లభిస్తుంది. వర్ధని అన్న ప్రసాద్ చిరుద్యోగి. స్నేహితుడు రజనీకాంత్‌ని వర్ధనికి పరిచయం చేస్తాడు ప్రసాద్ వర్ధని మెట్రిక్ పాసవుతుంది. వర్ధని తల్లి మాణిక్యమ్మగారు మరణిస్తారు. వర్ధనీ రజనీకాంత్‌లు వివాహం చేసు కోవాలను కుంటారు. సుందరిచే మోస గించబడ్డ ఆనందరావుకి అతనంటే ఇష్టపడే రాణిగురించి చెప్తుంది వర్ధని. ప్రయివేట్‌గా ఇంటర్ చదువుతూం టుంది వర్ధని.

'అవునవును యిప్పుడెలా వూరుకుంటావు ... ఎదిగి తాటిచెట్టంత అయ్యావుగా ... మిమ్మల్నింకా నెత్తి కెక్కించుకోడం నాదే తప్పు ... అప్పుడే అలా వదిలేస్తే ఎక్కడో అడుక్కుతినేవారు...'

'అలా చేసినా బాగుండేది యీ దెవ్వళ్ల కంటె... పెట్టిందేం లేకపోయినా అధికారానికి మాత్రం లోటులేదు ... ఆ మాట కొస్తే యేం పెట్టారు ... అన్నయ్యకు అక్కయ్యకు మీరెలాగూ పెట్టింది లేదు ... మిగిలింది

మేమిద్దరమేగా ... అమ్మ పోలిక కాబట్టి కృష్ణుడిని కాస్త చూస్తున్నారు ... పైగా మీరు చెప్పిన ప్రతిపనీ తు. చ. పాటిస్తాడు... చేస్తాడు ... అందుకే వాడికి బట్టలు కుట్టిస్తారు పుస్తకాలు కొంటారు...పని కుర్రాడికి

కూడ ఆ మాత్రం ఎవరన్నా చేస్తారు ... తండ్రి పోలిక కాబట్టి అదీలేదు నాకు... ఇక మీరు పెట్టిందేమిటి ? పోతే నెల నెలా అన్నయ్య డబ్బు పంపుతూనే వున్నాడుగా.'

'వాసూ ... తాతయ్యతోనేనా నువ్వు

## రా గ వీ చి క లు

మాట్లాడుతుంటా' మహాలక్ష్మమ్మగారు మధ్యలోవచ్చి అడ్డుతగిలింది...

'అవునమ్మమ్మా ... యిందులో యేది నిజంకాదో చెప్పమను'

'యేది నిజమైనా.. యేది అబద్ధమైనా ...నువ్వుమాత్రం అలా మాట్లాడ కూడదు నాయనా ... ఎవరేమనుకున్నా మీ కాళ్లమీద

(48 వ పేజీ చూడండి)

**"క్రమిన్ అప్పారావ్! కమిన్"**
**ట్రాన్సిస్టర్‌ను ఎడమచేత్తో పట్టుకొని ఎడమ చెవి దగ్గర పెట్టుకొని వింటూ అన్నాడు ప్రణవమూర్తి**

ప్రణవమూర్తి గ్రౌండ్ వాటర్ డిపార్ట్‌మెంటులో ఎ ఈ అతడే ఆ ఆఫీసుకు ఆఫీసరు అప్పారావు అదే ఆఫీసులో యూ. డీ సి చేతిలో ఫైల్ టేబిల్‌మీద పెడ్తూ "స్కోరెంత సార్!" అన్నాడు అప్పారావు.

"ఏదీ ఇప్పుడే మొదలెట్టారు మేచ్ రాత్రంతా చినుకులు పడి చిత్తడిగా వుండడం మూలాన ఆట ప్రారంభించేసరికి ఆలస్యం అయ్యింది" అన్నాడు ప్రణవమూర్తి

"ఏమయినా వెస్ట్ ఇండీస్ చిత్తుగా దంచేస్తున్నారు సార్" అన్నాడు అప్పారావు

"మన టీమ్‌కు మంచి లీడ్ లేదోయ్! పటౌడీ నాకు నచ్చలేదు బేడీని కేప్టన్‌గా తీసెయ్యడం ఘోరం. .వాడు మంచి స్పిన్ బౌలర్ మనదంతా పాలిటిక్సు, పాలీట్రిక్సు" అన్నాడు ప్రణవమూర్తి

"గవాస్కర్‌ని రెండో టెస్టు మేచ్‌కి కెప్టెన్ చేశారటగదండి సార్"

"కల్లిచరణ్ సెంచరీ కొట్టాడు" కామెంటేటర్ ఆవేశంతో అరిచేస్తున్నాడు ట్రాన్సిస్టర్‌లో

"వండర్‌ఫుల్ మార్వెలస్" ఎగిరి గంతేశాడు ప్రణవమూర్తి అప్పారావును అమాంతం కౌగలించుకున్నాడు.

అప్పారావు వుక్కిరిబిక్కిరైపోయాడు.

స్వష్ డోర్ నెట్టుకొని లోపలికొచ్చాడు చెన్నకేశవులు చెన్నకేశవులు ఎల్ డీ సీ. చేతిలో ఫైలుంది చూపుల్లో బెదురుంది ప్రణవమూర్తి, అప్పారావ్ యింకా మామూలు మూడ్‌లోకి రాలేదు "సార్!" అన్నాడు చెన్నకేశవులు

"ఏమిటోయ్ నీ ఏడుపు! ఎందుకంత కంగారు" విసుక్కున్నాడు ప్రణవమూర్తి

"కలెక్టర్‌గారితో ఈరోజు కాన్ఫరెన్సు వుంది సార్! గుర్తు చేద్దామనీ" అన్నాడు చెన్నకేశవులు.

"యూజ్‌లెస్ ఫెలోస్! వీడికీ యిప్పుడే తీరింది కాన్ఫరెన్సుకి మేచ్ మంచి స్పీడ్‌లో వుందీ రోజు" అన్నాడు ప్రణవమూర్తి

"ఐ డోన్ట్ థింక్ సార్! కలెక్టరుగారు కాన్ఫరెన్సు వాయిదా వేస్తారు అసలాయన ఊర్లో వున్నారో లేదో అనుమానం మేచ్‌కి వెళ్ళివుంటారనుకుంటా" అన్నాడు అప్పారావు

"ఇంకా అలాగే బెల్లంకొట్టిన రాయిలా నిల్చుంటావేం" చెన్నకేశవుల్ని కసురుకున్నాడు ప్రణవమూర్తి

"ఎక్స్‌క్యూజ్‌మీ సార్! యీరోజు అంబారం డ్రింకింగ్ వాటర్ స్కీమ్ ఫైల్ మీకు చూపించమన్నారు"

"మన్నాను మన్నాను . తెచ్చావా! ఏడవలేక పొయ్యావ్! ఇదిగో కేశవులూ! నీకెన్నిసార్లు చెప్పాను నేను కామెంట్రీలో వున్నప్పుడు డిస్టర్బ్ చెయ్యొద్దనీ" చీదరించుకున్నాడు ప్రణవమూర్తి

చెన్నకేశవులు వెళ్లిపొయ్యాడు

"ఆ నర్సులంతా ఇంతే సార్!" పండ్లు ఇకిలించాడు అప్పారావు.

"ఏ నర్సులోయ్!" అడిగాడు ప్రణవమూర్తి.

"బియ్యే! ఆనర్సులు సార్! ఈ చెన్న కేశవులూ బియ్యే ఆనర్సే" చమత్కరించాడు అప్పారావు. అప్పారావులా అటెండరు హోదాలో నుండీ యూ డీ సీ దాకా పెరగలేదు చెన్నకేశవులు

"వాడి బృహన్నల మూతీ వాడూనూ! క్రికెట్ అంటే వీడి బొంద వీడికేమి తెలుసోయ్" వెటకారంగా అన్నాడు ప్రణవమూర్తి.

అప్పారావుకు క్రికెట్‌ను గురించి ఓనామాలు

"ఏమయినా క్లైయివ్ లాయిడ్ జెమ్ సార్! మంచి బ్యాటింగ్"

"ఈ మేచ్‌లో విజయం వెస్ట్ ఇండీస్‌దే లేవోయ్. నో డౌట్"

"అంత ష్యూర్‌గా చెప్పడం కష్టం సార్. మనవాళ్ళూ కాన్ఫిడెన్సుతో ఉన్నారు!"

"కాన్ఫిడెన్సూ కాదు. . కాకరకాయా గాదూ. ఓవర్ కాన్ఫిడెన్స్"

"అంతా సొట్టతల రామానుజం గాళ్లోయ్ మనవాళ్ళు"

"ఆట డ్రా అయితే కావచ్చు"




తెలియవు ప్రణవమూర్తి ఏనాడూ బ్యాట్ పట్టిన పాపానపోలేదు. కానీ కామెంట్రీలు వింటారు. విని రక్తం వేడిజేసుకుంటారు. పొంగిపోతుంటారు. ఉప్పొంగిపోతుంటారు. ఉద్రేకంలోకి దిగుతుంటారు... అదీ నాగరికత అదే నాగరికత

* * *

చెన్నకేశవులు సీట్లో వచ్చి కూర్చున్నాడు. ఆఫీసు హాలంతా అల్లకల్లోలంగా ఉంది ఎల్ డీ సీలంతా మేనేజర్ చుట్టూ చేరారు. స్టెనో టైపిస్టు అంబుజం అందర్లో కలిసిపోయింది

"గ్రీనిడ్జ్ బాగా ఆడుతున్నాడోయ్" మేనేజర్ ప్రశంసించాడు

"చందూ గాడొస్తేగానీ ఆట స్పిరిట్‌ను గురించి మనకు చెప్పేవాళ్ళు లేరు"

"చందూగాడు లక్కీ ఫెలోరా! మేచ్‌కి ముందు రోజు సెలవుపెట్టి వెళ్లిపోతాడు"

రేడియోలో కామెంటేటర్ స్వరం స్పీడూ, పిచ్చీ హెచ్చింది

అంతా ఎగిరి గంతేశారు అంబుజంను త్రొక్కేశారా హడావుడిలో

"సారీ మేడమ్" అంతా చెప్పుకొన్నారు అంబుజానికి

# స్కోరెంత?

అంబుజం కిసుక్కున నవ్వింది "గో ఎహెడ్! గో ఎహెడ్!" అంది.

సిగరెట్లు తెగ పీల్చేస్తున్నారు. కాఫీ గ్లాసులు కాళీ జేస్తున్నారు. సీట్లవద్ద కప్ బోర్డులు ఒక్కటే బీగాలు తీసిలేవు

చెన్నకేశవులు పెద్దగా నిట్టూర్చాడు. ఈమధ్య ఎక్కడో చదివాడు. ఒక పెద్ద ఎకనామిస్టు వ్రాశాడు క్రికెట్, టెన్నిస్ వగైరాలు బ్యాన్ చెయ్యాలని వ్రాశాడు దేశంలోని ఆర్థిక వ్యవస్థను అవి ఎంతగా కృంగదీస్తున్నాయో సోదాహరణంగా వ్రాశాడా మహానుభావుడు. టెస్ట్ మ్యేచ్‌లకయ్యే ఖర్చు అంతా అనలైజ్‌చేసి వ్రాశాడు ఎంత డబ్బు ప్రజలదీ, ప్రభుత్వానిదీ ఎంత ఖర్చు ప్రయాణాలకూ, హోటళ్లకూ, విలాసాలకు ఎంతముందు ఎంత మంది రిజర్వేషన్లు. శుద్ధ వేస్టు ఆకాశవాణికి ఎంత ధన వ్యయం, కాల వ్యయం

అంతా కామెంట్రీలు వినేవాళ్లే మ్యేచ్ జరిగినన్నాళ్లూ అసలు ఎన్ని ఆఫీసులు పనిజేస్తున్నాయ్ ఆఫీసు పనుల్లో ఏంత జాప్యం జరుగుతుంది హాస్పిటల్స్‌లో, కోర్టు చావిడీలల్లో ఎక్కడ చూసినా ట్రాన్సిస్టర్ల మోత

ఎంత మేన్ పవర్ వేస్టు బ్యాంకులు ఆ రోజుల్లో ఎన్ని సరిగ్గా పనిజేస్తాయి? రిజిస్ట్రేషన్‌లు ఎన్ని ఆగిపోవడంలేదు ఇంకా నయం టెలివిజన్ కూడా వస్తే ఈ క్రీడాకారులకు పట్టపగ్గాలుంటాయా

"చెన్నకేశవులుగారూ!" ఖద్దరుధోవతీ ఎదురు కుర్చీలో కూర్చుని పలకరించింది

చెన్నకేశవులు అసలు లోకంలో పడ్డాడు

"ఏమిటండీ మేనేజర్ చుట్టూ మూగారు మీవాళ్లంతా" అన్నాడా మనిషి

"ప్రజాస్వామ్యమండీ ప్రజాస్వామ్యం" చెన్నకేశవులు చిన్నగానే అన్నాడు

"మాటలు మామీదే విసురుతున్నారు" చిన్నబుచ్చుకుంది ఖద్దరు ధోవతీ ఖద్దరువాలాలకు తెలిసిన ప్రజాస్వామ్యమంతా రాజకీయమే ఖద్దరు రాజ [illegible] కీయమే

"మిమ్మల్నేమీ అనడంలేదండీ! ఈ దేశానికి పట్టిన దౌర్భాగ్యాన్ని గురించి అంటున్నా" చెన్నకేశవులు స్వరం హెచ్చించి అన్నాడు

అప్పారావు ఆఫీసర్ గదిలోనుంచి తిరిగి వచ్చాడు

"ఏమిటి చెన్నకేశవులూ దౌర్భాగ్యమంటున్నావ్!" అప్పారావు మామూలుగానే అడిగాడు.

"కాకపోతే ఏమిటండీ! ఈ రెండు రోజుల్నించీ దేశంలో ప్రతి పనిలోనూ ఎంత స్తబ్ధత ఉందో చూశారా! ఎక్కడచూసినా క్రికెట్ కామెంట్రీయే!" ఆవేశంగా అన్నాడు చెన్నకేశవులు

"ఓరి దౌర్భాగ్యుడా! నీకు తెలిసిందల్లా అదేనా! యిలాంటి హుషారు పుట్టించే కిక్కులు అప్పుడప్పుడూ లేకపోతే మన గుమాస్తా జీవితం మొనాటనీ అయిపోదూ!" అన్నాడు అప్పారావు.

"దేశం ఎకానమీ మాటేమిటి" అన్నాడు చెన్నకేశవులు

"ఆఁ! దేశాన్ని నువ్వొక్కడివే ఉద్ధరిస్తున్నావు" అప్పారావు గట్టిగానే అన్నాడు

"ఆఫీసర్ గూడా కామెంట్రీలలో పడిపోతే యిక ఆఫీసు ఎలా పనిజేస్తుంది. కనీసపు మనుగడ కోసం సగటు మనిషి చచ్చి కూర్చుంటుంటే, ధరల పిశాచం ఆకాశం ఎత్తున పెరిగి మ్రింగుతుంటే, క్రికెట్ సర్కస్ ఆటలాడడానికి దాని కామెంట్రీలు వినడానికి సిగ్గులేదూ" చెన్నకేశవులు ఒళ్ళు దగ్గర పెట్టుకోకుండా అనేశాడు

"చాల్చాల్లే అఘోరించావ్! కాస్త లౌకికం గూడా నేర్చుకో అవతల ఆఫీసర్‌గారు నీ ప్రవర్తన జూసి ఎంత విసుక్కున్నారో తెలుసా నువ్వు ఫైల్ మీద సంతకం పెట్టించుకోకుండానే చీవాట్లు పెట్టించుకొని తిరిగివచ్చావు నేను చూడు ఆయన అమాంతం నన్ను కౌగలించుకున్నారు ఫైల్ చూడకుండానే సంతకమూ పెట్టారు. చెన్నకేశవులూ నువ్వు గుర్తుంచుకో! నీది టెంపరరీ పోస్టు" చెన్నకేశవులుకి కఫాలానికి అంటేటట్లు అంటించి మరీ వెళ్ళాడు అప్పారావు

ఆఫీసర్ ఆరోజే చెన్నకేశవుల్ని మళ్ళీ మళ్ళీ విసుక్కున్నాడు. అప్పారావు అప్పటికే మాటలు దాటేసినట్లున్నాడు

ఆ సాయంకాలం [illegible] వరకూ అదోలా చూశారు చెన్నకేశవుల్ని ఆ చూపులన్నీ అతన్ని వెక్కిరించాయి

"ఏమోయ్ చెన్నకేశవులూ! క్రికెట్ మేచ్‌లు మన దేశంలో బ్యాన్ చెయ్యాలన్నావట."

"ఆకాశవాణిని ఘెరావో చేయిస్తానన్నావట."

"వీధుల్లో నినాదాలతో ఊరేగింపు జరుపుతానన్నావట"

"ప్రజల్లో అన్టి క్రికెట్ మూవ్‌మెంట్ తెస్తానన్నావట"

"ఏం బ్రదర్! వుద్యోగం చెయ్యడం యిష్టంలేదా."

"ఆఫీసర్‌కి కోపం తెప్పించి ఇంకా గెటాన్ కాగలననే ధైర్యముందా మిత్రమా"

"మా మాట విను బ్రదర్! నువ్వు క్రికెట్ ఆడకపోతే మానెయ్ చూడకపోతే మానెయ్ కనీసం టెస్టు మ్యేచ్‌ల కామెంట్రీ అన్నా వినవోయ్"

"కనీసం ఈ ఆఫీసర్ వున్నన్ని రోజులన్నా కామెంట్రీ విని చప్పట్లు తట్టి కేరింతలు కొట్టవోయ్"

"ఇలాగే వున్నావంటే ఏ క్షణాన్నైనా నీ వుద్యోగం టెర్మినేటు కావచ్చు"

"నీది టెంపరరీ పోస్టు గుర్తుంచుకో."

"నువ్వు అనర్హు అన్న మాట మర్చిపో"

"ఆఫ్టరాల్ ఎల్ డీ సీ అదీ గుర్తుంచుకో"

ఆఫీసులోని అన్ని గొంతులో ఎన్నోవంతులు ఆరోజే అక్కడే ఉపదేశించాయి ముక్తకంఠంతో మ్రోగిపొయ్యాయి.

ఆరోజు రాత్రంతా ఈ దేశపు వ్యవస్థనూ, ఈ సామాజిక అవస్థనూ తలచి తలచి నిట్టూర్చాడు చెన్నకేశవులు జాగరణ చేశాడు

* * *

మరునాడు ఆఫీసుకి అందరికంటె ముందే చేరాడు చెన్నకేశవులు

ప్రణవమూర్తి ఫ్లష్ డోర్ తలుపున త్రోసుకొని రూమ్‌లోకి వెళ్లాడు ఇంతకంటె లీజర్‌గా ఆఫీసర్ దొరకడం కష్టం చెన్నకేశవులుకి ఫైల్ తీసుకొని వెంటబడ్డాడు కిర్రుమని శబ్దం చేసుకుంటూ ఫ్లష్ డోర్ రెక్క దభాలున చెన్నకేశవులు తలకు తగిలింది తల దిమ్మతిరిగింది బొప్పికట్టింది తడువుకుంటూనే ఆఫీసర్ గదిలోకి వెళ్ళాడు

తెప్పరిల్లి ఆఫీసర్ వంక జూశాడు. రౌద్రా [illegible] ప్రస్ఫుటం చెవి దగ్గర చేరి వుంది చెన్నకేశవులు చేతిలోని ఫైల్ వైపు చూశాడు తలకు తగిలిన దెబ్బ జివ్వుమంది తేరుకున్నాడు ఫైల్ మూసేశాడు.

"స్కోరెంత సార్!" చిరునవ్వుతో అన్నాడు చెన్నకేశవులు ఆఫీసర్ ముఖంలో చిరునవ్వు తాండవించింది ఆనందరేఖ ప్రభవించింది అదే చెన్నకేశవులుకు శ్రీరామరక్ష అభయహస్తం.



సీరియల్

# జీవనది

— పోలాప్రగడ రాజ్యలక్ష్మి

## 14

ఉష దగ్గర్నుంచి వుత్తరం వచ్చి రెండు నెలలయింది పంపిస్తూన్న డ్రాఫ్టులూ, మనిఆర్డరులూ అందుతున్నాయో లేవో అర్థంకావడం లేదు ఆ మధ్య వచ్చిన మనిఆర్డరు రశీదుమీద కూడా, ఉషది కాకుండా, ఎవరిదో సంతకం వుంది. మరి పోస్టాఫీసులో తనకి వచ్చిన రిజిష్టర్లూ, మనిఆర్డర్లూ మరియొకరికి యివ్వవచ్చని ఆథరైజేషను లెటరు యిచ్చిందో ఏమో! పోనీ కాలీ లేకో ఊళ్ళో లేకో ఇంకొకళ్ళని తీసుకోమని అందే అనుకో, అయితేమాత్రం తర్వాత తనో వుత్తరం రాయొద్దూ డబ్బు అందిందని? ఏవీ అర్థంకాక ప్రభాకరం మనస్సు చాలా చికాకుగా వుంది ఆ రోజున బెల్ కొట్టగానే రాలేదని ప్రొద్దుట సీతాల్ని కేకలేశాడు. పేషెంట్స్‌తో గట్టిగా మాట్లాడిందని నర్సుని చివాట్లు పెట్టాడు ఒక కాంప్లికేటెడ్ కేసులో, తన సలహాని మళ్ళీ మళ్ళీ అడుగుతూ, ఎంత చెప్పినా అర్థంచేసుకోకుండా, ఇంకా అనుమానంగా ముఖం పెట్టినందుకు డాక్టర్ జానీ మీద విసుక్కున్నాడు ఆమె కళ్ళల్లో నీటితెర కనిపించేసరికి ఎందుకు విసుక్కున్నానా అని తర్వాత బాధపడ్డాడు విదుపుతూండగా ధర్మామీటరు చేతిలోంచి జారి బద్దలైంది. ప్రిస్క్రిప్షన్ రాసియిచ్చే 'పేడ్'లో కాగితాలు అయిపోయాయి పెన్ కనిపించలేదు

ఇదీ అని చెప్పలేని కోపం, విసుగూ.

మనస్సంతా తిక్కగా వుంది

పేషెంట్స్‌ని చూడాలనీ, రౌండ్స్‌కి వెళ్ళాలనీ అనిపించడంలేదు ఒంట్లో బాగానే ఉంది కాని మనస్సేవిటి ఇలా చికాగ్గా ఉంది! జానీని పిలిచి

(గత సంచిక తరువాయి)

"ఇంకివాళ్టికి నేను వర్క్ చెయ్యలేను వెళ్ళి రెస్ట్ తీసుకుంటాను అర్జంటు కేసు యుంటే మీరు చూడండి మరీ అవసరం అయితే పిలవండి" అంటూ, హాస్పటల్‌కీ ఇంట్లోకీ మధ్య నున్న అద్దాల 'పార్టిషన్ డోర్' తీసుకుని ప్రభాకరం లోపలికి వెళ్ళిపోతూంటే, జానీ, బేలగా చూస్తూ ఉండిపోయి, కాస్సేపయ్యాక గట్టిగా నిట్టూర్చి తర్వాత తన గదిలోకి వెళ్ళిపోయింది ఆమెలో వచ్చిన కలవరపాటూ, ముఖంలో తెచ్చిపెట్టుకున్న గాంభీర్యం వెనక నుంచి తొంగి చూస్తూన్న వేదనా, కళ్ళల్లో కనిపించిన నీటి తెరా చూసి, సీతాలు తెల్లబోయాడు. డాక్టరు బాబుగారికి వంట్లో బాగుండకపోతే ఈవిడెందుకు బాధ పడడం? తనకి జ్వరం వచ్చినప్పుడు చూడ్డానికని వచ్చిన రావుడు ఇలాగే బాధ పడింది. మగాడి ఇబ్బంది చూసి ఆడది కన్నీళ్ళు పెట్టుకుంది అంటే అర్థం ఏమిటి?. .

అయ్య బాబోయ్!

రావుడు తనని ప్రేమిస్తోందా?

అలాగే డాక్టరమ్మగారు కూడా ప్రభాకరం బాబుని? ఏదో కొత్త విషయం తెలిసినట్లు తెగ సంబర పడిపోతూ ఆ పూట హాస్పటల్ అంతా అలంగం తిరిగాడు సీతాలు. అయితే వాడి మనస్సులో ఒక విషయం ముల్లులా దాక్కొని మధ్య మధ్య తల ఎత్తుతూ ఇబ్బంది పెడుతూనే ఉంది. డాక్టరమ్మ ప్రభాకరం బాబుని పెళ్ళాడితే, మరి, ఉషమ్మగారో! ఈ అమ్మా మంచిదే కాని, తన కేవిటో డాక్టరు బాబు ఉషమ్మని పెళ్ళాడ్డమే బాగుంటుందని పిస్తోంది

ప్రభాకరం, ఉషమ్మా –

లేకపోతే ప్రభాకరం, డాక్టరమ్మా –

అలాగే తనూ రావుడూ ..

భలే – బాగుంది – సంతోషంతో ఎగిరి గంతేశాడు సీతాలు.

ఇంట్లోకి వెళ్ళిన ప్రభాకరం, 'పైకి కాఫీ ఒకటి పంపించు అమ్మా' అంటూ ఓ కేక వేసి మేడ మీదకి వెళ్ళిపోయాడు ఫేన్ వేసి ఆ మట్టునే బట్టలు మార్చుకోకుండా మంచం మీద పడుకున్నాడు ఏవేవో ఆలోచనలు – ఒకదాని కొకటి సంబంధం లేకుండా తలా తోకా లేని ఆలోచనలు.

మనుష్యులూ – కోరికలూ – అంతస్థులూ అభిమానాలూ – డబ్బూ హోదా దర్జా – అడవిలో వికసించిన గులాబీ – ఆప్యాయంగా తెచ్చుకొని ఫ్లవర్ వాజ్‌లో అలంకరించుకొనే ప్రయత్నాలూ – ముల్లులా గుచ్చుకొనే పట్టుదలా, పౌరుషం – సమయం కోసం వేచిఉండే ఓర్పూ – ఏవో ప్రత్యేకతలూ అంతస్థులూ అందించాలనే అభిలాషా, కాంక్ష – ఆలశ్యాన్ని భరించ లేని ఆవేశం – ఎన్నటికీ కలుసుకోడానికి వీలులేని సమాంతర రేఖలూ – మబ్బు పరదాలలోకీ మంచు తెరల మాటుకీ తప్పుకుంటూన్న చందమామ – మధువుకోసం తోటచుట్టూ రొదచేస్తూ తిరిగే తుమ్మెదలూ – తేనెటీగలు శ్రమపడి కూర్చిన తేనెని తేనెతుట్టతో సహా తన్నుకుపోయే కిరాతకులు –

ఇలా గజిబిజిగా ఏవేవో రూపాలు!

అర్థంలేని ఆలోచనలు!!

చిరాగ్గా మంచం దిగి లేచి నిలబడ్డాడు.

ఇంకా కాఫీ రాలేదు.

"ఏం? . . ఇంట్లో మనుష్యులు వున్నారా లేరా? కాఫీ పంపించమని చెప్పి ఎంతసేపైంది?"

ప్రభాకరం వేసిన కేకకి గదులూ హాలుతో సహా మొత్తం యిల్లంతా మార్మోగింది. కొడుకు వేసిన కేక విని జోగమ్మ నిశ్చేష్టురాలైపోయింది. వంటావిడతో "ఏమిటోనమ్మా. ఈమధ్య వీడికి ఎప్పుడూ లేంది విసుగూ కోపం ఎక్కువైపోయాయి!" అంటూ నిట్టూర్చింది వంటావిడ తయారుచేసిన కాఫీని కప్పులో పోసి యిస్తూ, "ఈ విసుగులన్నీ పెళ్ళి ఆలస్యం అయి! అమ్మగారు వస్తే అన్ని విసుగులూ తగ్గుతాయి" అంది చిరునవ్వు నవ్వుతూ.

జోగమ్మ ఆశ్చర్యంగా వంటావిడ ముఖంలోకి చూసింది. తర్వాత ఆమె చెప్పింది నిజమే అనిపించింది "అయినా కావాలని పెళ్ళి వాయిదా వెయ్యడం ఎందుకు? అందరిమీదా ఈ విసుక్కోవడం ఎందుకు? బాబూ, నాయనా, పెళ్ళి చేసుకోరా అని తను ఎన్నాళ్ళనుంచి చెబుతోంది. తన మాట చెవిని పడనిస్తేనా? ఇంకేమైనాసరే, ఇవాళ ఆ విషయం ఏదో తేల్చెయ్యాలి!" యిలా ఓ గట్టి నిర్ణయానికి వచ్చి, కాఫీ కప్పు తనే పుచ్చుకుని అతి ప్రయాసమీద మెట్లన్నీ ఎక్కి మేడమీదకి వెళ్ళింది జోగమ్మ

ఆయాసపడుతూ వచ్చిన తల్లిని చూసి నొచ్చుకుంటూ "నువ్వు తేకపోతే ఎవరిచేతనైనా పంపించక పోయావా కాఫీ?" అన్నాడు ప్రభాకరం

"ఎవరున్నారు? వంటావిడకి నాకంటే నీరసం మెట్లెక్కితేనే కళ్ళు తిరుగుతాయి అంటుంది. ఇల్లు విప్పి కొత్త తాటాకు నేసు

**జరిగిన కథ 9 :** భద్రయ్యగారి పిల్లలు మురళి, ఉషలు భద్రయ్యగారి ఆస్తంతా దాన ధర్మాలతో హారించిపోయింది భద్రయ్యగారి కుటుంబాన్ని కనిపెట్టి వుండమని కొడుకు ప్రభాకరానికి చెప్తారు జోగమ్మగారు ఉషని చెరచ ప్రయత్నిస్తాడు అంకరాజు. భద్రయ్యగారు మరణిస్తారు ఢిల్లీ చిత్ర కళా ప్రదర్శనలో బహుమతి సంపాదిస్తాడు మురళి ఉషని మద్రాసులొని ఆంధ్ర మహిళా సభలో చేర్పిస్తాడు ప్రభాకరం. దొడ్డమ్మ జోగమ్మగార్ని చూడాలని వస్తుంది లీల మురళితో కలసి విహార యాత్రలకి బయల్దేరుతుంది లీల పెళ్ళనే తంతు లేకుండానే దంపతు లౌతారు లీల మురళిలు. మెడిసన్ పూర్తయ్యాకే పెళ్ళి అన్న ప్రభాకరం అంటే యేవగింపు కలుగుతుంది ఉషకి. లీల మురళిలను చూడాలని వచ్చిన ఉష, ప్రభాకరాన్ని కలుస్తుంది

కుంటున్నారట, రావుడు ఇవాళ పనిలోకి రానంది... ఇంక వున్నది నేనేగా ? ... చిన్నవేతల యిలాంటి పనులు చెయ్యడానికీ, నీ సంరక్షణ చూసుకోడానికీ, కోడలుంటే బాగుండిపోయేది. కాని నువ్వు పెళ్లి అనే మాటనే పడనియ్యవుగా ? . నేను బతికుండగా నువ్వు పెళ్లి చేసుకోవు నాకు తెలుసు ..'' అంటూ వుస్సురని కుర్చీలో కూలబడింది జోగమ్మ

కాఫీ చప్పరించి ఆగి, తల్లి ముఖంలోకి చూసి, ''మళ్ళీ మొదలెట్టావా పెళ్లి గొడవ ?'' అన్నాడు ప్రభాకరం విసుగ్గా

''అయినా నాకు తెలియక అడుగుతాను ఒక్క సంగతి చెప్పు అబ్బాయి ! నువ్వు అసలు పెళ్లి చేసుకుంటావా ? ఏం కర్మ వచ్చిందిరా ఏం లోటని ? నిక్షేపంలా నీకు నచ్చిన పిల్లని చేసుకుని, చిలకా గోరింకల్లా యింట్లో తిరక్క ఈ వంటరి బ్రతుకేవిటిరా ? పోనీ ఏ పిల్లనేనా పెళ్లాడతానని మాటిచ్చావేమో చెప్పు ఆ పిల్లనే తీసుకొచ్చి పెళ్లి చేస్తాను '' జోగమ్మ యిలా కంఠశోషగా అంటూంటే, ప్రభాకరం విసుగ్గా ''అమ్మా ఎందుకిలా పదే పదే చెప్తావు ? నేను పెళ్లి చేసుకుంటాను నీకు నచ్చిన పిల్లనే చేసుకుంటాను. అందమైంది, బుద్ధిమంతురాలు, నీకు సేవ చేసేది నాతో కలిసి ప్రాక్టీసు చేస్తూ నాకు చేదోడు వాదోడుగా వుండేది'' అంటూ ఇంకా వాక్యం పూర్తి చెయ్యలేదు జోగమ్మ సంబరంతో ''నిజంగానా ?.. ఎవర్రా ఆ పిల్ల ? జానీయా ?'' అంది

ప్రభాకరం ఉలిక్కిపడ్డాడు వెంటనే తొట్రుపడుతూ ''కాదు .. కాదు జానీ కాదు ఎవరో .. రెండు మూడేళ్ళు ఆగు తెలుస్తుంది'' అన్నాడు

''ఏవిటీ ? ఇంకా మూడేళ్ళా ? ... పర్లే ... నువ్వు పెళ్ళి చేసుకున్నావు ! ... నేను చూశాను !'' అంటూ కోపంగా అని, కాళీ కప్పు తీసుకుని విసురుగా వెనక్కితిరిగి మెట్ల దగ్గిరకి వచ్చింది జోగమ్మ. కోపంతో వళ్ళంతా వూగిపోతోంది. రక్త ప్రవాహం అధికమై కణతలు అదురుతున్నాయి నరనరాలూ పట్టు తప్పి, ముంచుకొచ్చినట్లు ఏదో వెర్రినీరసం శరీరం అంతా వ్యాపించింది చుట్టూ వున్న ప్రదేశం ఒక్కమారు తిరిగినట్లయి కళ్ళు చీకట్లు కమ్మాయి. తూలి పడబోయింది పడకుండా ఆపుకుందాం అని జాపిన చేతికి పక్కనే వున్న 'రైలింగ్' అందలేదు. ముందుకి వేసిన కాలికి కిందమెట్టు తగల్లేదు.

దబ్బుమన్న ధ్వని వెంటనే అరుపుతో కలిసి దడ దడా దొర్లుతూన్న శబ్దం విని, కంగారుగా గదిలోంచి బయటకి వచ్చాడు ప్రభాకరం ఆఖరి మెట్లమీంచి దొర్లుతూన్న తల్లి శరీరం కనిపించింది. ''అమ్మా !'' అంటూ వళ్ళు తెలియని పిచ్చి కేక పెట్టాడు గుండె లవిసేలా భయంకరంగా వినిపించిన ఆ కేకకి అదిరిపడి, హాస్పటల్ సిబ్బంది, చుట్టు పక్కల ఉన్న జనం, వంటావిడ, అప్పుడే ఇంటికి వెళ్ళబోతున్న జానీతో సహా, పాతికమంది అయితే హాలులోకి పరిగెట్టుకుని వచ్చారు

చూస్తే ఏముంది ?

మెట్లకింద స్పృహ కోల్పోయి పడి ఉన్న జోగమ్మ

మెట్లపైన నిశ్చేష్టుడై ప్రాణం లేని కట్టెలా నిలబడి ఉన్న ప్రభాకరం ''అయ్యో... అయ్యో... ఏం జరిగింది ? . ఇలా పడిపోయారేవిటి ? '' అంటూ అంతా ఒక్కసారిగా ఘొల్లుమన్నారు. ఏం జరిగిందో తెలియక, ఏం చెయ్యాలో తోచక, అంతా కాళ్ళూ చేతులూ కలియదొక్కుకుంటూ కంగారు పడసాగారు. ఒకటి రెండు నిముషాలు జానీకీ, ఏం తోచలేదు. మతి పోయినట్లు ఉండిపోయింది

తర్వాత తేరుకుని, కంగారుగా జోగమ్మగారి ముక్కు దగ్గర వేలుంచి చూసి, చిందరవందరగా తప్పుకున్న బట్టల్ని సరిచేసి, చేతిలో ఇంకా ఆ మట్టునే ఉండిపోయిన గాజు కప్పు హేండిల్ని లాగి, అవతల పడేసి, నుదుటిమీంచి కారుతూన్న రక్తాన్ని చూసి అదుర్దాగా ''నర్స్ ! నువ్వూ, సీతాలూ, ఆ లోటే, ఆ వాచ్‌మేన్ మీ నలుగురూ కలిసి ఆవిడని సాయం పట్టి హాస్పటల్‌లోకి తీసుకు రండి. ఊ త్వరగా'' అంది థియేటర్‌లోకి తీసుకువెళ్ళి, ఇంజక్షనిచ్చి, స్మెల్లింగ్ సాల్ట్ వాసన చూపించి, అనుమానం వచ్చినప్పుడు ఆక్సిజన్ ఎక్కించి, కృత్రిమ శ్వాస కల్పించి, అరగంట ప్రయత్నిస్తేనే కాని జోగమ్మ ఆ షాక్ నుంచి తేరుకోలేదు

కంఠంలో మూలుగు వినిపించి కనురెప్పల మీద కదలిక కనిపించాక, 'హమ్మయ్య !' అంటూ జానీ, నుదుటిమీద పట్టిన చెమట కర్చీఫ్‌తో తుడుచుకుంది. అక్కడక్కడ చెక్కుకుపోయి, రక్తం చిమ్మిన గాయాలకీ, ముఖ్యంగా నుదుటిమీద తగిలిన పెద్ద గాయానికి, డ్రెస్సింగ్ చెయ్యమని నర్సుకి చెప్పి వెనక్కి తిరిగింది.

అప్పటిదాకా ఏ చలనమూ లేకుండా నిర్జీవంగా నిలబడి, చైతన్యం కోల్పోయి, కళ్ళల్లో కోటి భయాలతో చూస్తూన్న ప్రభాకరాన్ని సమీపించి, ''డాక్టర్ ! నో వర్రీ ! యువర్ మదర్ ఈజ్ సేఫ్'' అంది జానీ

ఆ మాటలతో ప్రభాకరం ఈ లోకంలోకి వచ్చాడు అతని కళ్ళల్లోకి ముఖంలోకీ జీవం ప్రవేశించింది అతనిలో కదలిక కనిపించింది. పెద్ద భారం తీరినట్లు నిట్టూర్చి ''థేంక్యూ డాక్టర్ !.. మతి పోయి ఏం తోచక నేను ఉండిపోయిన సమయంలో, మీరు చటుక్కున పూనుకొని సాయం చేశారు కనక కాని లేకపోతే ప్రాణం పోవడానికి ఎంత సేపు కావాలి ? మా అమ్మని బతికించారు మీ మేలు మరిచిపోలేను'' అంటూ చటుక్కున ఆమె రెండు చేతుల్నీ తన చేతుల్లోకి తీసుకున్నాడు అతని స్పర్శతో వళ్ళంతా ఒక్కమారు జివ్వుమన్నట్లయి నోట మాట లేకుండా ఒక్క క్షణం వుండిపోయి, వెంటనే సిగ్గుతో అతని చేతుల్లోంచి తన చేతుల్ని తీసుకుని ''అదేవిటిసార్ ? యిూమాత్రానికే ?'' అంది. మనస్సునిండా నిండిన కృతజ్ఞతతో ప్రభాకరం ఏం మాట్లాడలేదు. ఇందాకా తగిలిన అతని స్పర్శతో నిలువెల్లా పులకించి జానీ కూడా మాట్లాడలేకపోయింది.

ఆ పూట వంటావిడా, జానీ, సీతాలూ ఎంత మందో బతిమాలారు కాని వాళ్ళ మాటలేం వినకుండా అన్నం తినడం మానేసి, కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ తల్లి బెడ్ దగ్గరే కూచున్నాడు ప్రభాకరం జానీ ఏదో చెప్పబోయింది. ''నన్ను యిలా మా అమ్మ దగ్గర కూర్చోనియ్యండి డాక్టర్ ! నిజమే !






రోజా కొన్ని వందల కేసులు చూస్తున్నాం. కాదనను. కాని మా అమ్మ కేసు అంటే యేదో భయంగా వుంది. నా బుర్రేం పనిచెయ్యడంలేదు. ఈ కేసు మీరే చెయ్యండి. మళ్ళీ మా అమ్మని నాకివ్వండి చాలు'' అన్నాడు పసివాడిలా కన్నీళ్ళు పెట్టుకుంటూ

మర్నాడు అమ్మకి యిలా ఏక్సిడెంటు జరిగిందని అటు ఉషకీ, ఇటు లీలకీ మురళికీ వుత్తరాలు రాద్దాం అని కూర్చున్నాడు ప్రభాకరం. పోస్టుమేన్ పట్టుకొచ్చి టపా యిచ్చాడు. చూస్తే అందులో ఉష దగ్గర నుంచి వచ్చిన కవరు వుంది తక్కిన వుత్తరాలన్నీ పక్కని పెట్టి ముందా కవరు చింపాడు ప్రభాకరం ఎంతో ఆసక్తితో

తను పంపిన డ్రాఫ్టు తిప్పి పంపేసింది. దాంతోపాటు చిన్న వుత్తరం కూడా రాసింది.

ప్రభాకరంగారికి నమస్కారములు.

మీరు యింతవరకూ చేసిన సహాయానికి కృతజ్ఞతలు నాకు గవర్నమెంటువారి ఫేమిలీ ప్లానింగ్ స్కాలర్‌షిప్పు వచ్చింది అందువలన యింకా మీరు నాకు డబ్బు పంపించి, నా చదువు కోసం శ్రమపడవలసిన అవసరంలేదు. ఎవరి సహాయమూ, అవసరం లేకుండా నా కాళ్ళమీద నేను నిలబడాలి అని మీరు అనుకుంటూ వచ్చిన సంకల్పం నెరవేరింది అందుకే మీ డ్రాఫ్టు మీకు తిరిగి పంపిస్తున్నాను. అత్తయ్యకి నమస్కారాలు అందించండి

ఇట్లు
'ఉష'

పొడి మాటలతో వున్న ఆ చిన్న వుత్తరం, దానితో తిరిగివచ్చిన డ్రాఫ్టు ఈ రెండూ చూస్తూనే ప్రభాకరం, కుర్చీ వెనక్కి జేర్లబడిపోయాడు. ఆ వుత్తరంలో ప్రత్యేకంగా ఏమీ లేకపోయినా, దాన్ని చూడగానే ఆమె అంతర్యం, మనస్సులో వున్న భావం, అంతా అర్థమైపోయినట్లు అనిపించింది ప్రభాకరానికి. అసలామెని మెడిసన్‌లో చేర్పించినప్పటినుంచీ, తనతోటి అదో మాదిరిగా ముభావంగా వుంటోంది తనమీద ఏదో

## గా జు మే డ

కోపం, విసుగూ పెట్టుకున్నట్లుంది. ఆ సంగతి కోణార్కంలో మురళి ఇంట్లో మరీ కన్పించింది. నాలుగు రోజులు ఉందామని వెళ్ళిన మనిషి, తను అక్కడికి చేరుకున్న మర్నాడే వెళ్ళిపోవడం ఏమిటి? నిరుడు శలవలకి రాకుండా వైజాగ్‌లో ఉండిపోవడం ఏమిటి? ఈమధ్యన ఉత్తరాలు రాయకపోవడం, ఇప్పుడీ డ్రాఫ్టు తిప్పి పంపేసి ముందు ముందు ఇంక డబ్బు పంపించనక్కర్లేదని రాయడం ఇవన్నీ చూస్తూంటే ఉష కోపం సామాన్య స్థాయిలో లేదనీ, ఏదో విపరీతంగానే ఉష ఆలోచిస్తోందనీ అర్థం అవుతోంది

అంత కోపం రావడానికి తను ఏం చేశాడని? కానయితే, 'నేను మెడిసన్ చదవను వచ్చేస్తాను' అన్నప్పుడు అలా వీల్లేదని మందలించాడు. అయినా కుర్రతనం కాకపోతే శుభ్రంగా వచ్చిన సీటు పోగొట్టుకోవడం ఏమిటి? .. చదువు మానేసి పెళ్ళి చేసుకోవాలని తొందర పడుతోందా?.. ఆ.. తెలివి తక్కువ. తనెక్కడికి పోతుంది, నే నెక్కడికి పోతాను?.. హాయిగా ఆ మెడిసన్ ఏదో పూర్తి చేసుకుని తర్వాత పెళ్ళి చేసుకోవడం తెలివా, మధ్యలో పెళ్ళి చేసుకోవడం తెలివా? పెళ్ళి అయితే ఇంక చదువు సాగుతుందీ?...

ఏదో కోపంలోనో పౌరుషంలోనో డ్రాఫ్టు పంపించివేసి ఉంటుంది . అయినా స్కాలర్‌షిప్పు రావడం ఆ డబ్బుతో చదువుకోవడం అదికూడా ఒకందుకు మంచిదే! ఆత్మ విశ్వాసం పెరుగుతుంది... సరే. . అసలు సంగతేమిటో ఈమాటు వైజాగ్ వెళ్ళినప్పుడు తెలుసుకోవచ్చు.. ఇప్పుడు అమ్మకి జరిగిన యాక్సిడెంటు సంగతి కూడా ఉషకి ఎందుకు తెలియపర్చడం? అయ్యో పాపం ఎలా వుందో అంటూ మళ్ళీ అదో వ్యాకులత పెట్టుకుంటుందేమో . యీమాటు వెళ్ళినప్పుడు చెప్పవచ్చులే అని ప్రభాకరం ఆలోచించి లీలకీ, మురళికి తెలియపర్చి, ఉషకి రాయకుండా వూరుకున్నాడు.

జోగమ్మ మంచాన పడడంతో, ప్రభాకరం మరీ వంటరితనాన్ని ఫీలవసాగాడు హాస్పటల్‌లో వున్నప్పుడు, రోగులూ, మందులూ, పరీక్షలూ వీటితో కాలక్షేపం బాగానే అవుతోందికాని ఇంట్లోకి వచ్చాక అందులో రాత్రిళ్ళు మరీను, నిముషం ఒక యుగంలా గడుస్తోంది. చెప్పుకోడానికీ తోడు లేదు. మాట్లాడడానికి మనుష్యులు లేరు ... వంటావిడా, రావుడూ ఎవరి పనులు వాళ్ళు చేసుకుపోతూ వుంటారు. ఈమధ్య రావుడు అమ్మకి సాయంగా రాత్రిళ్ళు, అమ్మ బెడ్ పక్కనే చాప వేసుకుని పడుకుంటోంది. తనకి కాలక్షేపంగా వుంటాడు పోనీ సీతాల్ని కూడా వచ్చి యిక్కడ వుండమంటేనో!

అమ్మ వైద్యం వగైరా అన్నీ జానీ వచ్చి చూసుకుంటోంది. మధ్య మధ్య తనని అడుగుతోంది. జానీ తల్లి కూడా రోజూ ఏదో వేళలో అమ్మని పలకరించి వెళుతోంది. నాలుగైదు రోజులయినా అమ్మ లేచే ఎత్తు కనిపించలేదు చివరకి జానీ రెండు మూడు రకాలుగా అనుమానాలు ప్రకటించి, 'ఎక్స్‌రే' తీసి చూసింది

రిజల్టు చెప్పిన రోజున అమ్మ వెన్నెముక కాదు తన వెన్నెముక జారినట్లనిపించింది ప్రభాకరానికి కుర్చీలో అమట్టున కూలబడిపోయాడు. జానీ ఎన్ని రకాలుగానో ధైర్యం చెప్పింది. మనం ఎన్ని కేసులు డీల్ చెయ్యలేదు? ఎందుకిలా, డీలా పడిపోతారు? అంది

ఈ మధ్య హాస్పటల్‌లో తన పనీ జానీ పనీ, ఇద్దరిదీ జానీయే చూస్తోంది. అది కాకుండా ప్రతి గంటకీ తనని వచ్చి పలకరిస్తూ, ధైర్యం చెబుతూ, ఏ పూట అయినా భోజనం చెయ్యకపోతే దగ్గర కూచుని కబుర్లు చెప్పి భోజనం చేయించి మరీ వెళుతోంది . నిజానికి ఇలా వంటరిగా ఉన్న సమయంలో, దేవతలా జానీ ఉండి ఆదుకుంది కనక కానీ, లేకపోతే తన పని ఏమౌను?

రాను రాను జానీ పట్ల చెప్పలేనంత కృతజ్ఞత ఏర్పడి, దాంతో ఆమె తనకి ఎంతో చేరువయినట్లు అనిపించసాగింది ప్రభాకరానికి రెండు మూడు మాట్లు కృతజ్ఞతలు చెప్పబోతే ''అదేమిటిసార్! మీరు నాకు చేసిన ఉపకారంలో ఇది ఎన్నోవంతు! మీ ధర్మమా అని నేను అటు వైద్యంలోనూ, ఇటు జీవితంలోనూ ఎన్నో కొత్త సంగతులు నేర్చుకున్నాను. నా మెడిసన్ చదువు కోసం మా అమ్మ చేసిన అప్పు అంతా, ఈ రెండు మూడేళ్ళనుంచీ మీ రిచ్చిన జీతం వల్ల తీరిపోయింది. డాక్టరుగా నామీద నాకెంతో ఆత్మ విశ్వాసం పెరిగింది. ఇవన్నీ నాకు సామాన్యంగా లభించి ఉండేవా'' అంది 'జానీ ఎంత బుద్ధిమంతురాలు!' అనుకున్నాడు తను.

తన హస్తవాసి మంచిదంటూ చుట్టుపక్కల ఎన్ని ఊళ్ళవాళ్ళో వచ్చి తన దగ్గర వైద్యం చేయించుకుంటూ, పుష్కలంగా యిచ్చే డబ్బులోపాటు ఎన్నో పళ్ళూ, కూరలూ, రకరకాల దినుసులూ యిచ్చిపోతూంటే, నవ్వుతూ వాటిని స్టాఫ్ అందరికీ పంచి ''ఇవాళ డాక్టరుగారూ వాళ్ళ అమ్మగారే కనక ఈ సంబారాలన్నీ అందరంకూడా తీసుకుంటున్నాం రేప్పొద్దున్న మిసెస్ ప్రభాకరం వచ్చాక అదేం కుదరదు అనొచ్చు లేదా సంసారం పెరిగి వారికే సరిపోవచ్చు. ఏం డాక్టర్!'' అని తనకేసి తిరిగి అప్పుడప్పుడు జానీ తమాషాగా

(35 వ పేజీ చూడండి)

# పైస్కోపు బాతాఖానీ

(22వ పేజీ తరువాయి)

తారీఖ్ వేషం అన్నమాట! అంటే జంటగా అమ్మాయి లేని పాత్ర. రీనారాయ్ వేషం కొంచెం తాజాగా వున్న కొత్త అందాలబొమ్మ ఎవరికైనా యిస్తానంటున్నాడు నిర్మాత..."బెటర్ దే స్టాండ్. ఇన్ క్యూ అండ్ ట్రై!"

## యోగితా - కిషోర్

తెనుగు పత్రికల వాళ్ళెంతో మర్యాదస్తుల్లా గున్నారు అన్నాడు "శెఖ్మీ" రచయిత మీర్జా ... మీర్జా ఆరడుగులు పొడుగున్నాడు. యువకుడే. మంచి బలమైన డైలాగులు రాసిన ఈ యువ రచయిత గుల్షన్‌నందా లాగా "నోవలిస్ట్" కాదు. 'గునెహాగార్' అన్న మరో చిత్రం యితని క్రెడిట్!

అక్కడ ఫిలిం ప్రెస్ అంటే బొంబాయిలో యింత యిదిగా వుండరుట! వుండరుమరి! అక్కడ తారలూ యింత 'యిది'గా వుండరుగా... ఆ మాటే తాహిర్‌హుస్సయిన్ కూడా అన్నాడు. శివాజీ వేసిన 'బాబు' చూశాను ... "వాహ్! ఏక్ దమ్ ఫస్ట్‌క్లాస్ ఏక్టింగ్‌కే హై. శివాజీ సాబ్‌నే వుస్మే" అన్నాడు. కిషోర్‌కుమార్ పాటలు తెనుగు లోకి తెచ్చే ప్రయత్నం? "బావ్‌రే నేను చేయను" అన్నాడు.

యోగితాబాలి, కిషోర్‌కుమార్‌ల పెళ్లి వార్త యోగితా ధ్రువపరచటంలేదుట కాని వాళ్ళిద్దరూ ఒకే బంగ్లాలో వుంటున్నారు. యోగితాబాలికి సరిగ్గా కిషోర్‌కుమార్ వయసులో సగం వుందిట, అంటే 23 మాత్రం — ఆ అమ్మాయి ఈ టాప్ క్లాస్ గంధర్వ గాయకుణ్ణి టాప్ క్లాస్ కమేడి యన్, క్లాస్ పిక్చర్ నిర్మాతనీ పెళ్లి చేసుకుంది; కాని మార్కెట్ పోతుందేమో, గ్లామర్ తగ్గి పోతుందేమో నన్న భయంతో యోగితా కిషోర్ కుమార్ అనో, యోగితా గంగూలీ అనో పేరెట్టు కోటం లేదట. ఆ అమ్మాయి కిది "లవ్ ఎట్ ఫస్ట్ సైటు ఫస్ట్ వెడ్డింగ్" కాని వెటరన్ కిషోర్ కిది తృతీయ వివాహ వైభోగం. అదీ సంగతి.!!

* * *

మద్రాసులో హేమామాలిని యింట్లో ఒక 'స్వర్గ లోకం' వుందని ఇన్‌కమ్‌టాక్సు అధికారులు పట్టు కున్నారు. ఈ డిస్కవరీనివాళ్ళు ఆమె పేరుతో వార్తా పత్రికలకి మొదట ఇవ్వలేదుకాని బొంబాయి నుంచి వెలువడే పెద్ద ఆంగ్ల సచిత్ర వార పత్రిక ఆ అమ్మాయి వున్న సినిమా స్టిల్ వేసి ఈ వార్త ప్రముఖంగా వేయటంతో దేశమంతా మరింతగా చెప్పుకున్నారీ వార్తని...

— వీ ★ ★

## సోగ్గాడులో రాముడు - భీముడు

"రాముడు — భీముడు" చిత్రాన్ని నిర్మించిన రామానాయుడుగారే "సోగ్గాడు" చిత్రాన్ని రూపొం దిస్తున్నారు.

"సోగ్గాడు" చిత్రంలో రాముడు — భీముడు నటిస్తున్నారు. మూడు మాస్టలయినా దాటని కోడెదూడల పేర్లు "రాముడు — భీముడు" అని, సోగ్గాడుకు తోడుగా రాముడు — భీముడు వుంటా రని, నిర్మాత నాయుడుగారు చెప్పారు.

సురేష్ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న "సోగ్గాడు" వర్ణ చిత్రం షూటింగు సెప్టెంబరు నెలంతా ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతుంది అని సురేష్ అధినేత చెప్పారు.

విజయవాడ, ఈడ్పుగల్లు, హైదరాబాద్, మండపేట మున్నగు ప్రదేశాలలో "సోగ్గాడు" విహరించడం జరుగగలదని, నాయుడు వక్కా ణించారు.

"సోగ్గాడు" చిత్రంలో శోభన్ వైవిధ్యంవున్న పాత్రను పోషిస్తున్నారు. "అమాయకుడు, బుద్ధి మంతుడు, చదువులేని సంస్కారధనుడు, పట్టుదల గలవాడు, గ్రామ శ్రేయస్కుడు అయిన సోగ్గాడుగా శోభన్ నటిస్తున్నారు.

చిత్రంలోని ప్రధాన పాత్రలను జయసుధ, జయచిత్ర, అంజలీదేవి, మంజుభార్గవి, రాజబాబు, సత్యనారాయణ, అల్లురామలింగయ్య, నాగేష్ పోషిస్తున్నారు.

"సోగ్గాడు" చిత్రంలోని కొన్ని పాటలను విన్నాను. పారే గోదావరిలా, పొంగే యవ్వనంలా వున్నాయనిపించాయి. ఈ చిత్రానికివిన్సెంట్ ఛాయను, జి. వి. సుబ్బారావు కళను, మార్తాండ్ కూర్పును, జాన్సన్ సంభాషణలను నిర్వహిస్తున్నారు.



"శ్రీ రాజేశ్వరీ విలాస్ కాఫీ క్లబ్"లో జయప్రద

నవయుగ ద్వారా విడుదలయ్యే ఈ చిత్రానికి కె. బాపయ్య దర్శకుడు.

## ఉదయిని ఆర్ట్స్

రెండు దశాబ్దాల మంచి నిర్మాణ నిర్వాహకు డుగా మంచి పేరు గడించిన టి. వి. కృష్ణారావు యిన్నాళ్ళకు చిత్ర నిర్మాత అయ్యారు. ఆయన సంస్థ పేరే ఉదయిని ఆర్ట్స్.

శివాజీగణేశన్, విజయ ప్రధాన పాత్రలను పోషించిన "మనసున్న మనిషి" చిత్రాన్ని నిర్మిం చారు. అనువదించబడిన చిత్రమే అయినా, అక్ష రాలా తెలుగు చిత్రం అనిపించే అంశాలు వున్నాయి "మనసున్న మనిషి" చిత్రంలో. డబ్బింగ్ చిత్రమా? కానేకాదు అన్నారు, యిటీవల ఆ చిత్రాన్ని చూసిన వాళ్ళు.

స్నేహంకోసం ప్రేమను, ప్రాణాన్ని త్యాగం చేసిన ఒక వుత్తముడుగా శివాజీ అద్భుతంగా నటించారు. మన "కళావాచస్పతి" గారి కంచు కంఠం శివాజీ నటనకు మరింత ప్రకాశాన్ని యిచ్చింది.

గత పదేండ్ల కాలంలో యింత శుభ్రత, జాగర్త వున్న డబ్బింగ్ చిత్రాన్ని చూడలేదు అని పించింది.

— శ్రీనివాస్





"ఈ కాలపు పిల్లలు"లో ప్రభ, దేవదాసు

*సుందరానికి నవ్వు వస్తోంది మామూలుగా కాదు - గోదావరి వరదకన్నా. ఏటి ఉప్పెనకన్నా వుధృతంగా పొంగుకొస్తోంది. చేతిలో పువ్వుల పొట్లాం ప్రక్కకు గిరాటేసి, రోడ్డుమీదే పగలబడి నవ్వేద్దామని వుంది, ఇంజినీరుగదా...*

అలా నవ్వేయడాన్కి సభ్యత అడ్డొచ్చి, వుప్పెనలా వస్తున్న నవ్వు బలవంతాన ఆపుకుని, "అబ్బ! యిలాంటి సంఘటన రోజుకొకటి జరిగినా చాలు గదా, చెప్పకొని చెప్పకొని నవ్వుకోడాన్కి" అనుకున్నాడు

టయిము అపుడే అయిదూ యాభై!

ఎంతకీ రాని బస్సుమీద కోపమొచ్చింది.

మనిషి అక్కడే వున్నాడుకాని, మనసు మాత్రం శ్యామల దగ్గరుంది

"శ్యాం . . ఇవాళ తాజ్ రెష్టారెంట్ దగ్గరేం జరిగిందంటే . . అంత త్వరగా చెప్పేస్తానేమిటి? నాకు మాంచి మాంచి బహుమతిస్తే చెపుతాను— అని వూరించి, వూరించి చెప్పి అరగంట సరిగ్గా అరగంట నవ్వించాలి" అనుకున్నాడు

అతనికి నవ్వుతో వుక్కిరి బిక్కిరయిపోతోంది

"వెధవది నాలుగు ఫర్లాంగులు నడవలేక బస్సుకోసం పడిగాపులు కాయడమేమిటి? నడిస్తే యీపాటికి 'శ్యాం'ని నవ్వించేస్తూ వుండేవాడిని"

ఆత్రుత అతన్ని నడిపించింది. ఇంకా వీధి చివరన వుండగానే యెదురుచూస్తున్న శ్యాంని చూసి నడక వేగం హెచ్చించాడు హారతిపళ్లెం పట్టుకురాలేదుకానీ, ఘనంగా స్వాగతం చెప్పింది.

రెండంగల్లో ఆరు మెట్లెక్కేసాడు. అతని మనసు బంతిలా గెంతుతోంది "శ్యాం. యివాళ తాజ్ రెష్టారెంట్ దగ్గరేం జరిగిందంటే." ఆ తర్వాత ముసి ముసిగా నవ్వి 'చెప్పనా?' అన్నట్లు చూసాడు

"ఏం జరిగింది?" అంది శ్యాం గోముగా

"అంత త్వరగా చెప్పేస్తానేమిటి? అరగంట నవ్వడం గ్యారంటీ నాకు మాంచి మాంచి బహుమతిస్తే చెపుతాను" అన్నాడు ముద్దు ముద్దుగా చిన్నపిల్లాడికి మల్లే.

ఏం బహుమతివ్వాలో ఆమెకు తెల్సు.

దగ్గరగా జరిగింది.

పువ్వుల పొట్లాం చేతి కందించి, రెండు చేతులతోనూ పొదివి పట్టుకుని ముద్దెట్టుకున్నాడు.

తర్వాత చెప్పాడు "రెష్టారెంట్‌లో జీవుడికి కాఫీ పోయించి, బస్ స్టాప్ దగ్గర నిలబడితే .. శ్యాం . . ఏం జరిగిందంటే ."

"చెప్పండి." శ్యాంకి ఆత్రుత పెరుగుతోంది.

"పది నిముషాలు క్రాటాటలా నిలబడ్డా ... బస్సు రాలేదు.

ఇంతలో ఓ ఆగంతకుడు అమాంతం వచ్చి, నన్ను కౌగలించుకున్నంత పనిచేసి, వుక్కిరి బిక్కిరి చేసేసాడు. "రేయ్ చలపతీ, యీ వూరెప్పుడొచ్చావురా? . . నాకో కార్డుముక్కయినా రాయనక్కర్లేదుట్రా ... యెన్నాళ్ళయిందీ నువ్వొచ్చి?. నీళ్ళు పడ్డట్టున్నాయ్ మాంచి ఛాయొచ్చావ్ ... అన్నట్టు మన సుదర్శనంగాడు..." అని, ఏం అనుమానమొచ్చిందో ఒక్కసారి నా మొహంలోకి తేరిపార చూసి, ఆశ్చర్యపోయి, అవాక్కయి, అలాగే నిలబడిపోయాడు. రెండు నిముషాలదాకా ఆయనలో చలనం లేదు. పాపం. ఆయన మొహం ... చూడు ... మనం ప్రొద్దుట కాల్చుకున్నాం, అచ్చు ఆ పెసరట్లలాగే మాడిపోయింది.

నాకు చాలా జాలేసిందనుకో శ్యాం...మొహంలో ఒక్క నెత్తురుచుక్కలేదు "సారీ మాస్టారూ—మా చలపతిరావనుకుని మీకు ట్రబులిచ్చాను. వెరీ వెరీ సారీ .. మీకు చాలా ట్రబులిచ్చాను. నన్ను క్షమించాలి" అని మరి మొహం చూపించలేకపోయాడు పాపం.

నిజం చెప్పొద్దూ - ఆ చలపతిని నేనే అయితే యెంత బాగుండిపోను అన్పించింది. అలాంటి ఫ్రెండు దొరకొద్దూ? .. నేను యీ వూరొచ్చి రెండు నెల్లయ్యింది. ఈ కొత్తూళ్ళో నాకు చాలా



ఆత్మీయులల్లే కన్పిస్తున్నారు. నేనే మీ చలపతి ననుకోండి — అని కాఫీకి తీసుకువెడదామనుకున్నాను శ్యాం . . ఆయన మరి కన్పించలేదు."

"ఆ చలపతీ మీలాగే వుంటారేమో . షాక్ తినివుంటాడు పాపం ! యీమారు కన్పించినపుడు కాఫీకి పిలవండి " అంది శ్యాం ఆగంతకునిమీద సానుభూతిగా

సుందరం మనసు తెరిసిన పడిపోయింది — గ్యారంటీగా అరగంట నవ్వించలేకపోయినా వాన వెలిసినంత ప్రశాంతంగా వుంది యీసారి అతని మనసు.

"జీతం ఏడు ముప్పై అయిదొచ్చింది శ్యాం. రెండొందలు మా నాన్నకు పంపిస్తాను. నీకో చీర, నాకో షర్టూ, ఓ టైంపీసూ, రెండు బెడ్ షీట్లూ యింకేం కావాలి ? ... యీ నెల యెలాగైనా ఓ వంద మిగిల్చేసి బాంకులో వేసెయ్యాలి ఊ . " అని విలాసంగా జేబులో చెయ్యి పె .ట్టబోయి .

"రె శ్యాం పర్సేదీ ? . పర్స్ నా పర్సు అరె ఏ జేబులోనూ కన్పించదేమిటి ? వ్వాట్ హేపెన్డ్ ? ."

* * *

"పాపం ఆయనకి చాలా ట్రబులిచ్చాను. కాఫీకి పిలిచినా బాగుండేది" అనుకుని "స్పెషల్ కాఫీ" అన్నాడు ఆగంతకుడు నోట్లు లెక్క పెట్టుకుంటూ



ఉండ్రాళ్ళు మెక్కేటి ఓ బొజ్జగణపయ్యా
అగ్రపూజ గైకొను దేవుడ వీవయ్యా
సర్వ కార్యములకు గురుదేవుడవు
నిను గొలుచుట మరచిన సిద్ధించవు

అలనాటి లంకేశ్వరుడు అహంకారముతోటి
నిను మరువ శివలింగమును పొందెనేమిటి ?
తొలి నమస్కారము నీ కర్పించిన చాలు
తుది వరకు కలుగు తప్పక జయాలు

నీ అండదండలున్న కొండలనే కదిలించవచ్చు
నిండు గుండెతో కొలిచిన నిను
కొండలా నడిపించవచ్చు
తొండము ఏకదంతము వాడవే కావచ్చు
బ్రహ్మాండమంతయు నీదు
కరుణకయి కైమోడ్పు

— ఎం. రామచంద్ర




## గా జు మే డ

(26 వ పేజీ తరువాయి)

నవ్వితే "జానీ నవ్వు ఎంత నిష్కల్మషంగా వుంటుంది ?" స్వర్గం నుంచి ఏ ఏంజెల్ దిగి నవ్వినట్లు ఏం నిష్కపట్యం ఆ నవ్వులో" అనుకున్నాడు ప్రభాకరం

పేషెంట్సు దగ్గర నుంచి వచ్చిన డబ్బు ఏ రోజుది ఆరోజు లెక్కచూసి తనకి అందీయబోయినప్పుడు తను ఎన్నిమాట్లో అన్నాడు "వుంచండి. ఎవరి దగ్గర వుంటే యేం ?" అని కాని జానీ విషాదంగా నేలకేసి చూస్తూ "అలా అంటే ఎలాగలెండి ! ఎవరి దగ్గర వున్నా ఒకటి ఎలా అవుతుంది మేం ఎలాగైనా పైవాళ్లమే కదా ! . కనీసం ఉషా, మురళీలాగ ఆత్మీయులం అయినా కాదు" అన్నప్పుడు తనకి నిజంగా జానీ అంటే జాలి వేసింది

అమ్మ ఇంక లేచే ఎత్తు కనిపించకపోయేసరికి, తను ఇబ్బందికరమైన ఆ కొత్త పరిస్థితికే అలవాటు పడుతూన్న సమయంలో ఒకరోజుల లీలా, మురళీ వచ్చారు వాళ్లని చూసేసరికి తనకి దుఃఖం పెల్లుబికి వచ్చింది దాంతోపాటు కొండంత ధైర్యంకూడా వచ్చింది అమ్మ కూడా లేని బలాన్ని తెచ్చుకుని మంచంమీదే అటూ యిటూ ఒత్తిగిలుతూ, కాస్త మాట్లాడుతూ వచ్చింది వాళ్ళున్న నాలుగురోజులూ వాళ్ళిద్దరూ వెళ్ళే రోజున అడిగారు "ఉష వచ్చి చూసి వెళ్ళలేదా ?" అని ఉషకి తెలియపరచలేదని తను చెబుదాం అనుకున్నాడు కాని ఆ సంగతి తెలిస్తే అమ్మ బాధపడుతుందని వూరుకున్నాడు చివరకీ అమ్మ బాధపడనే పడింది "అది రాలేదు పోనీ పాపం దాని చదువేం పాడవుతుందో . ఏవిటో ఎవరు వచ్చి చూసి మాత్రం, నా బాధని చేత్తో తీసిపారెయ్యగలరా ?" అంటూ కళ్ళనీళ్ళు కార్చింది

లీలా, మురళీ వెళ్ళిపోయిన రోజున తిరిగి వంటరితనం, తనని ఆవరించింది ఏం తోచక దిగాలుగా కూర్చుంటే జానీ వచ్చి ఆ కబురూ ఈ కబురూ చెబుతూ కొంత ప్రశాంతతని కలిగించింది మాటల సందర్భంలో అంది "డాక్టర్ ! మీకిది తెలుసా ? సీతాలు రావుడిని పెళ్లి చేసుకుంటాడట !" అని

ఆ సంగతి తను కొత్తగా వినలేదు అంతక్రితం ఒకటి రెండుసార్లు అమ్మే చెప్పింది పైగా ఈమధ్య వాళ్ళిద్దరి గుసగుసలూ, ఒకరు కనిపించినప్పుడు రెండోవాళ్ళ కళ్ళల్లో జిగేల్ మంటూన్న మెరుపూ ఇదంతా చూస్తూంటే వీళ్ళిద్దరూ ఎప్పుడో పెళ్లి చేసుకుంటారు అని తనకి చాలాసార్లు అనిపించింది అయితే తన ఎదురుగా వాళ్ళెప్పుడూ పడలేదు ఒకవేళ పడినా తట్రుపడుతూ చటుక్కున విడిపోయి, ఏదో సీరియస్ విషయాలు చర్చించుకుంటున్నట్లు నటించసాగారు. ఇదంతా తను పరిశీలించాడు కనక తనకి తెలుసు జానీ కెలా తెలిసిందబ్బా !

అందుకే నవ్వుతూ జానీని అడిగాడు "మీకెలా తెలిసింది ?" అని

"నిన్న రావుడు నాతో అంది సీతాలు నన్ను మనువు ఆడతాట్ట మధ్యవర్తుల ద్వారా కబురు చేశాడు 'సరే' అని ఆడికి చెప్పడానికి సిగ్గేస్తాంది మీరు కాస్త ఆడికి చెప్పండమ్మా—అని"

ప్రభాకరం పకపకా నవ్వి "ఏవిటీ ? వాళ్ళకి మధ్యవర్తులా ? సీతాలుకి చెప్పడానికి రావుడికి సిగ్గా ?" అంటూ మళ్ళీ నవ్వాడు

జానీ తల వంచుకొని, రావుడు మాట ఎలా వున్నా ముందు తను సిగ్గుపడుతూ "అదేవిటండీ ! ఆడదానికి సిగ్గు కాదా ? నేను పెళ్లి చేసుకుంటానని సిగ్గులేకుండా తలెత్తి మగాడితో ఎలా చెబుతుందండీ !" అంది

(ఇంకా వుంది)




"వద్దురా" — అన్నాను!

"హాయిగా ఏ అగ్గిపెట్టెల పరిశ్రమో పెట్టరా" అని నచ్చజెప్పాను వింటేనా?!

"ఇంకా నయం! తేనెటీగల పరిశ్రమ పెట్ట మన్నావు కాదు డబ్బు నాది పోతే నష్టం నాది నీ కెందుకు బాధ? నే చెప్పినట్లు చెయ్యి" శాసించాదు

ఇంకేదన్నా అభ్యంతరాలు పెట్టి ఉందునేమొ గానీ, వాడి నోరు అసలు మంచిది కాదు!

"సరే — నీ యిష్టప్రకారమే కానియ్యి! పేరేం పెట్టదలిచావ్?" సోఫాలో వెనక్కి వాలేను

"అదే చూస్తున్నా బాగా ఆకర్షణగా 'క్యాచీ'గా ఉండాలి"

"రెండక్షరాలా, మూడక్షరాలా?"

"నా న్యూమరాలజీ ప్రకారం మూడక్షరాలే ఉండాలి"

"మధ్యన అదొకటి కూడానా?! సరే — నీకు తోచినవి చెప్పు నాకు తోచినవి నేను చెబుతాను"

"కరుణ, అరుణ, మాధవి, శిరీష"

"ఒరేయ్ ఆగాగు! ఏవిటి వీళ్లంతా నీ ఆడ స్నేహితులా?" గాభరాగా అడ్డుకున్నాను

"ఇంకా నయం ప్రియురాళ్లా అన్నావ్ కాదు. నేనేమన్నా కృష్ణ పరమాత్మ ననుకున్నావా? మరీ అమాయకత్వంగా మాట్లాడతావేంరా ఫూల్? ఈ రోజుల్లో ఆకర్షణ అన్నింటి కన్నా ప్రధానం!"

"సరుకున్నా లేకపోయినా ఫర్వాలేదన్నమాట! ఒరేయ్, నన్నిలాంటి కల్తీ బేరాల్లోకి దింపకు నాకు గిట్టదు" ఖండితంగా చెప్పేసాను

"ఒరేయ్, నిన్ను బతిమిలాడ్డంతోటే సగం అలిసిపోయాన్నేను నా ఉత్సాహం చంపకు తెలుగు దేశానికింత ఉపకారం చెయ్యనియ్!"

"వహ్వా! చాలా బావుంది నువ్వు చెయ్య నంతలో తెలుగుదేశంలో దీపం వెలగదనుకోకు."

"ఆగాగు ఒరేయ్, మంచి హింటిచ్చావ్! దీపం ..వెలుగు...వెన్నెల...శభాష్! బావుందొరేయ్.. 'వెన్నెల' అని పెట్టేద్దాం. ఎలా ఉంది?

"వెన్నెల లాగానే ఉంటుంది, జాగ్రత్తగా కృషిచేస్తే!"

"డబ్బునాది—కృషినీది! ఏమంటావ్?"

"ఆనేందుకు ఏ ముందీ? పెట్రోలుంది. కారుంది. డ్రైవర్ని నేమన్నాను. ఛలోబేటా ఛల్! అంటూ అదిలించడమే తరువాయి. ."

"సరే, పేపర్లో యివ్వాల్సిన ప్రకటన నువ్వే చూడు.."

* * *

"ఒరేయ్, చాలా వచ్చినాయిరా"

"చాలా అంటే?"

"నాలుగొందలు!"

"హతోస్మి! నా కింతవరకూ యింతమంది రచయిత లున్నారనే తెలియదు తెలుగు పత్రికలు దివాలా ఎందుకు తీస్తాయొ నా కర్థం గావటం లేదు"

నవ్వేను

"నీ కింకా తెలుగు దేశమే అర్థం కాలేదు ఇంకా సేవా సపర్యలేమి చేస్తావ్?"

"మరీ అంత కొట్టిపారెయ్యకు మరీ పొరుగు రాష్ట్రంవాడిలా తెలుగు దేశమంటే 'గోంగూర వనం' అనటం లేదుగా?"

"అయితే విను! మనవాళ్లల్లో రాసేవా ళ్లెక్కువ ఆ ఎక్కువలో చాలా తక్కువమందికి మాత్రమే నిజంగా రాయడం వచ్చు"

"ఎందుకని?" అమాయకంగా అడిగేడు రాజు

"మనం ఎంతో ఆహారం తింటున్నాం తిన్న దంతా రక్తంగా మారిపోతుందా?"

"లేదనే చదివేను సైన్సులో!"

"అసలేమీ తినకుండా ఉంటే?"

"అదేమిటో మరీను అయిదో క్లాసు ప్రశ్నలూ నువ్వూను ఉపోషాలున్నవాడికి ఓపికేం ఉంటుంది?"

"అవునా? మరి బొత్తిగా విషయ పరిజ్ఞానం లేనివాడు రాసే రాతల్లో సారమేముంటుంది?"

"ఆలోచించాల్సిన సంగతే!"

"ఈ ఆలోచన కొరవడి నందువల్లే, మన దేశంలో - అంటే, తెలుగు రాష్ట్రంలో ముఖ్యంగా— పుస్తకాలమ్ముడవటం యజ్ఞం"

"మరి కొన్ని పుస్తకాలు 'హాట్ కేక్సు'లా అమ్ముడవుతాయే!"

"అవి వాటి స్థాయినిబట్టి! అమ్ముడు కావడమే ముఖ్యమనుకుంటే సెక్సు పుస్తకాలు దొరకనంతగా అదృశ్యమై పోవటంలా!"

"ఒరేయ్! మన పత్రిక సెక్సుకి అతీతంగా, నిఖార్సయిన సాహిత్య ప్రయోజనాలకు అంకితమై"

"అప్పుడుగానీ కాబూలీవాలాలు నీ వెంట పడరు!"

"అదేమిట్రా?!"

"అంతేమరి పత్రికకు వ్యాపార దృష్టికూడ లేకపోతే బతకదు!"

"నా కవేమీ చెప్పకు! కాగితం కావాలన్నావ్ ఆరు సంచికలకు సరిపడ తెచ్చిపడేసాను మిగతావన్నీ రెడీ 'వెన్నెల' యీ దీపావళి కల్లా వచ్చెయ్యాలి."

"ఆ రోజు అమావాస్య!" నవ్వేసాను

"పొడుగ్గా, చక్కగా పెరిగిన జుట్టు అంతా, విలువైన బాదంకాయ వల్లనే-ఖరీదు కట్టలేని రుణం అది," అంటారు అనితా రాబిన్స్,

ఎగుమతి సంస్థలో పని చేసే ఒక పెద్ద ఉద్యోగి.

అందుకే, పూర్వకాలంలో మలబారు తీరంలోని అందగత్తెలు, మోకాళ్ళ దాకా వచ్చే తమ కేశసంపదను గూర్చి గర్వంగా చెప్పుకునే వారు, వాళ్ళకు తెలుసు, బాదంకాయలోని పోషక పదార్థాలు, కొబ్బరి, వేరుసెనగ లేదా ఆ గం గింజల కన్నా ఎ ఉత్తమమైనవన్న సంగతి.

నేడు, మీరు బాదంకాయలోని పోషక పదార్థాలను వాడుకుని జుట్టు ఊడిపోవడాన్ని అరికట్టి మీ జుట్టును ఆరోగ్యవంతంగా, మెరిసే లాగ ఉంచుకోవచ్చును. ల్యూర్ ఆల్మండ్ హెయిర్ ఆయిల్‌తో మీ జుట్టును రాత్రీ, ఉదయమూ మర్దించండి. రాత్రి పూట, అది మీ జుట్టు కుదుళ్ళను గట్టిపరచి, పునరుజ్జీవితం చేస్తుంది. పగటి పూట, అది మీ జుట్టును చక్కగా దువ్వుకున్న పద్ధతిలో ఉంచుతుంది. మనోహరమైన సువాసన గల, ల్యూర్ ఆల్మండ్ హెయిర్ ఆయిల్,

జుట్టు బాగా దువ్వుకోవాలనుకున. ఆరోగ్యమైన జుట్టు కావాలనుకునే స్త్రీ, పురుషలందరికీ ఎంతో అవసరం.




"ల్యూర్ సమ్మోహింప జేసే అందాన్ని ఇస్తోంది, నాజుట్టుకు. ఆల్మండ్ హెయిర్ ఆయిల్ దానిని ఎప్పుడూ మెరిసేలాగ ఉంచుతుంది."

**ల్యూర్**

Creative Unit-A 1915 -Tel.

## ప్రశ్నావళి

**కె రామలక్ష్మి**

డి. వి. ఎస్. ఎస్.
కాకినాడ

స్త్రీ గృహ రాజ్ఞీయత్వానికి తన చేతుంతో తానే తిలోదకాలిచ్చి సమస్తావకాశాలనీ సర్వే చేసి రావాలని మనస్సు పెంచుకుని ముందుకు వెడుతోం దంటారా ? వెనక్కి వెడుతోందంటారా ?

★ అది చూసే మీ దృష్టినిపట్టి వుంటుంది. క్యూరియాసిటీ అపరాధం కాదే !

ఎ టి. విశాఖపట్నం

కె రా గారూ మీరు ఆ మధ్య విజయవాడ రచయిత్రుల సభలో మాట్లాడుతూ ఆడవారి పేరుతో మగవారు రచనలు చేస్తున్నారన్నారు నాకు మీమీద బలే కోపం వచ్చింది.

★ నిజం విని ఉడుక్కుంటే ఎలా ? !

కె ఆర్. కె. పాలకొండ

చరణదాసి అంటే అర్థం ?

★ జోళ్లు అందించేదని అనుకుంటాను !

జె. ఎస్. ఆర్ జయపురం

వెదుకే విజయం అందించడం భగవంతునికి వేడుకా ?

★ కాదు – మానవుని సత్ శీలానికి పరీక్ష.

కె. ఆర్. కె. ఎస్. కె. జె. మొదలైనవారు, కాజారు

ఈ దేశం ఎప్పుడు బాగుపడుతుంది ?

★ ఇప్పుడందుకేగద మన ప్రధాని పునాదులు వేస్తున్నారు

కె టి. ఎస్. ఎన్ బి–ఆర్ పల్లి

సమాజం అంటే ఏమిటి ?

★ మీరూ – నేనూ – మీ చుట్టూవాళ్లూ నా చుట్టూవాళ్లూ – అంతా కలిసే సమాజం.

సిహెచ్ వి ఆర్. అనపర్తి

అందరికీ ఇది మహిళా సంవత్సరం కాని మీకు అన్నీ మహిళా సంవత్సరాలే కదండీ ?

★ చిత్తం కాని కాకి దృష్టిలా మా కన్ను కొక్కదానికే చూపు వుండి లాభం లేదని – యీ ప్రత్యేక సంవత్సరం సూచించారు !

కె. ఎస్. ఆర్.
ముమ్మిడివరం

వైరాగ్యం అన్న పదానికి అర్థం ఏమిటి ?

★ ఈ జీవితాన్ని – దాని ఫలితాలని – నిర్వికారంగా, తామరాకుపై నీటిబొట్టులా అనుభవించేయడం

జి. ఎస్. ఆర్. సికింద్రాబాదు

'మ్యాన్ టు కమేండ్, వుమెన్ టు వాబే' అన్న మాట వినలేదనుకుంటాను

★ అలాంటి చెత్త వార్తలు విన్నా – తల్లో నిలవనివ్వను !

కె ఎల్. ఆర్. హైద్రాబాదు

విజయం గర్వకారణం కదా ?

★ కీర్తి ప్రతిష్టల కోసం ఎదురుచూస్తూ – సాధించే విజయం గర్వకారణం కాదు మన నైపుణ్యాన్ని సద్వినియోగం చేయడానికి పనికివచ్చేదే – గర్వకారణం అవుతుంది

---

## అమావాస్య–వెన్నెల

"అయితేనేం ? దాన్ని అందమయిన అమావాస్యగా మార్చేద్దాం !"

"సర్లే కానియ్ ! ఈలోగా యీ కథల్ని వడపొయ్యనీ "

* * *

"ఒక ఎనభై కథల దాకా తేలాయిరా ! ఒక పాతిక కథలు నిజమయిన సరుకున్నవి ఆ పాతికలో పది మాత్రం నాణ్యమైనవి ఒక్క అయిదు ఉన్నత ప్రమాణాలతో ఉన్నాయి !" అన్నాను

"మరీ అన్యాయంగా మాట్లాడతావేంరా ? ! మరీ 'న్యూస్ ఐటమ్'లా ఉంది ఎనభై ఖాళీలకి ఎనిమిదొందల ఐమీన్ ఎనిమిది వేల అప్లికేషన్సు వొచ్చాయన్నట్లు ! పాపం, కొత్తవాళ్లని కూడ పైకి తెద్దాం మరీ 'ఖడ్గపాణి'వి కాబోకు "

"నువ్వు నమ్మవేమొ కానీ, నేను ఎన్నుకున్న అయిదు ఉన్నత ప్రమాణాలున్న కథల రచయితల్లో నలుగురు మరీ కొత్తవాళ్లు ! పేరు, ప్రఖ్యాతులున్న వాళ్ళు కారు "

"అలాగని అందర్నీ కొత్తవాళ్లని పెడితే పత్రిక ఎవరూ కొనర్రోయ్ !" గాభరాపడ్డాడు,రాజు

"అందుకేం ఫర్వాలేదు !–బెర్లిగాంల మీద తెప్పించుకునే ప్రసిద్ధ రచయితల కథలున్నాయి కదరా ? మనం హోటలుకి ఫోను చేసి 'ఆర్డర్' బుక్ చేస్తే తినుబండారాలొచ్చినట్లు వచ్చిపడతాయి. ఎటొచ్చీ, కాస్త బెట్టుకొడతారు, అడగ్గానే పంపిస్తే పలచనైపోతామని !"

"నీకు మనవాళ్లు రచయితగా ఏలా పట్టం కట్టార్రా ?"

"నువ్విప్పుడు ఎడిటర్‌గా పట్టం కట్టినట్లే !"

* * *

"పత్రిక కాస్త నిలబడుతోంది ప్రకటనలు బతికిస్తున్నాయ్ ! అన్నట్లు–రచయితలకి పారితోషకాలు సరిగా పంపిస్తున్నావా ?"

"పారితోషకాలా ? ! వాళ్లకథ అచ్చువేసుకోవడం కంటే పారితోషకం ఏమివ్వాలో !"

"ఆలికి అన్నం పెట్టడం ఊరికి ఉపకారమా అన్నట్లు... నీ పత్రికలో కథలు అచ్చువేసుకున్నంతలో వాళ్లకు ఉపకారం చేసినట్లెలా అవుతుంది ?"

"మరి ఎంతమంది కొత్త రచయితలకి ప్రోత్సాహం ఇస్తున్నాం మనం ? ! అదెంత రిస్కు !"

"ఔరా ! యిదా నీ ప్రజాసేవ !" ఆశ్చర్యపోయాను.

"పత్రిక నిలబడే దాకానేరా. నిలబడితే 'పేరు' మీద నడిచిపోతుంది "

"ఊరు పేరుచెప్పి కాయలమ్ముకున్నట్లు ! మైడియర్, నీ అపోహల్లోంచి బయటపడు. ఇప్పటికే మనకు వచ్చే కథల్లో తేడా కన్పిస్తోంది ప్రారంభ సంచికలోని రచయితలక్కూడా నువ్వు పారితోషికం పంపి ఉండవు ! అందుకే వాళ్లనుండీ మళ్లీ రచనలు రాలేదు ఇలాగయితే, పత్రిక మూతపడక తప్పదు ఒట్టి చవకబారు కథలు, ఊసుపోక కబుర్లు, సినిమా బొమ్మలు–వీటితో పత్రికని మరీ హీనం చెయ్యకూడదు "

"అంటే–డబ్బిస్తేగానీ రచయితల మేధస్సు పని చెయ్యదన్నమాట ? అయితే, వీళ్లు రచనల్లో ప్రదర్శించే ఔన్నత్యం సంగతేమిటి ? ఆచరణలో అదేమి నిలవదా ?"

నవ్వేను.

"నీ మాటలకి ఆచరణకీ ఎంతభేదం ఉంది ? మనం సాహిత్య ప్రయోజనాలకీ పత్రిక మనుగడకవసరమైన వ్యాపార సూత్రాలకి ఎలాంటి రాజీ కుదిర్చాం ?"

రాజు బుర్ర గోక్కున్నాడు

"చూడు రాజా ! దారంతో బట్టలు నేయవచ్చు కుట్టవచ్చు యీ రెంటికీ పనితనం కావాలి. ఆ పనితనంలో కూడ ప్రావీణ్యత ఉండాలి. ఏమీ తెలియని వాడికి దారపు ఉండయిస్తే చెల్లాచెదురు చేసి, చిక్కుముళ్ళు వేస్తాడు

రచయితలు కూడ యింతే ! ప్రావీణ్యం ఉన్న వాళ్లని యితోధికంగా ప్రోత్సహిస్తే ఉత్సాహం పుంజుకుని కొత్త ప్రక్రియలు చూపుతాడు తను ఎదిగి, సంఘానికి పనికొచ్చే రచనలు చేస్తాడు "

"అలనాటి పోతన్నగారి కెవరుసాయం చేసారని కమ్మని కావ్యాలు రచించాడు ? సరస్వతీదేవి కన్నీళ్లకు కరిగి రాసానని చెప్పుకున్నాడు కదా ? ఆ విధమయిన 'సిన్సియారిటీ' ఎందుకుండదు యిప్పటి రచయితల్లో ? !"

నవ్వేను

"నీ సిద్ధాంత ప్రకారం సాహిత్య చరిత్రలో శ్రీనాధుడు గౌరవం పొంద తగడు ! వాళ్లతో బాటు– నన్నయ్య, తిక్కన, యర్రాప్రగడ, అల్లసాని పెద్దన, తెనాలి రామలింగడు. "

"ఆపరా నీ జడివాన ! ఒప్పుకుంటున్నా. : మనంకూడ పారితోషికాలిద్దాం "

"కనీసం యింత అని కూడ నిర్ణయిద్దాం "

"అదొకటా మళ్లీ ?"

"తప్పదు మరి !"

"సరే ఓ పాతిక రూపాయలిద్దాం"

"అదేమిట్రా ? పాల బకాయి కూడ తీరదు !"

"ముప్ఫై "

"ఇంటద్దె రాదు "

"నలభై "

"పావుమూట బియ్యం రాదు !"

"మనం వాళ్ల కుటుంబాలకి 'గార్డియన్ల'మా ఏమిట్రా ? యాభై రూపాయలకి మించి పావలా యివ్వను !" కోపంగా అరిచేడు

"మనం కథ కిచ్చే పారితోషకం మరో కథకి అందమైన ముగింపు అవుతుంటుంది రా ! అదే పండుగ రోజునో – చాలా రోజులుగా బకాయి పడ్డ బట్టల కొట్టువాడికి తృప్తి కలిగించి, కొత్త బట్టలిప్పించవొచ్చు ఇల్లాలికి కొత్తచీర మోజు తీరచ్చు చదువుకునే కొడుక్కి 'ఫీజు'గా మారొచ్చు ఏ తీవ్ర అనారోగ్యానికో అవసరమయిన ఖరీదయిన మందుకో సరిపడొచ్చు. "

"ఒరేయ్, నీ కివన్నీ ఎలా తెల్సురా ?" ఆశ్చర్యపడిపోతూ అడిగేడు రాజు

చిరునవ్వుతో చెప్పాను —

"నేనూ రచయితనే గనుక !"

# సామాన్యుని సణుగుడు

ఆంజనేయుడికి తోక వుందిగదా ? వినాయకుడికి లేదు ఎందుకు ? అంటున్నాడు, విఘ్నేశ్వరుణ్ని హనుమంతుణ్ని దేవుడు పటాలలో చూసినబాలుడు సమాధానం చెప్పడం ఏమంత తేలిక కాదు......

ఏనుగు తలకాయవుంది వినాయకుడికి, మరి హనుమంతునికి కోతిమూతి కదా వుందని చెప్దామా ? అంటే ఏనుగుకి మాత్రం తోకలేదు కనుకనా ? పోనీ ఆంజనేయుడు ఎగురుతాడు కనుక తోకవుందీ, వినాయకుడికి ఎలుకవాహనం కనుక, ఎగురడు కనుక తోక లేదు అని చెప్పాలని ప్రయత్నం చేశాను ... అయితే ఆంజనేయుడు వినాయకుడూ యుద్ధం చేస్తే ఎవరు గెలుస్తారు ? అన్నది వాడిప్రశ్న. వాళ్లిద్దరు యుద్ధం ఎందుకు చేసుకోవాలీ అన్నాను.. చేసుకుంటారు అనుకో . అప్పుడేమవుతుందీ.. ?




ఏమవుతుందీ ఏమవుతుందీ ? వినాయకుడు గెలుస్తాడూ అని చెప్పేద్దాం అనుకున్నాను కాని వాడి యిష్టదైవం రామబంటు హనుమాన్ అయితే చాలా యిబ్బంది. హనుమంతుణ్ని వినాయకుడు గెలుస్తాడంటే వాడు ఒప్పుకోడు పోనీ వినాయకుడు ఓడిపోతాడూ అని చెపితే . 'సరే ! చవితి పండుక్కి హనుమంతుడికే మనం పాలవెల్లి కడదాం దానికి మొక్కజొన్నకండెలు వేడదాం." అంటాడు....

అసలు ఎవరూ గెలవరురా ! ఎందుకంటే వినాయకుడు తొండంతో ఆంజనేయుణ్ని చుట్టేస్తాడూ. ఆంజనేయుడేమో అంటూండంగానే వాడు తోకతో వినాయకుణ్ని చుట్టేస్తాడూ అని పూర్తి చేశాడు.

ఈలోగా అవతల నుంచి కేక. అర్జంట్‌గా ఎవరో పెద్దమనుషులొచ్చారని తలుపు తీసేసరికి పలుగురైదుగురున్నారు. మీసాలున్నాయి. మంచి క్రాపింగ్‌లున్నాయి. దుస్తులు కూడా బాగున్నాయి. "మనపేటలో పూజలు చేస్తాం ... మీరింకా చందా వేయరేదేం ?" అని ఒకీలవాడి మొహంతో ప్రశ్న రెండోవాడు "నిన్ననొస్తే యింట్లో లేరన్నారు." లని ఆరోపణ "పోయిన్సాల ఏదో అమ్మవారికి పూజన్నారు. డబ్బులిచ్చాంగా" ఈసారి వినాయక వినాయక సారి విఘ్నేశ్వరచవితికదా?" అన్నాడొకడు "జంక్షన్‌లోచేయటం ఎందుకు యిది బిజినెస్ సెంటర్‌కాదు... యిళ్లు మాత్రం వున్నపేట కదా యింట్లో చేసుకుంటే చాలదూ" అంటే "అందరూ యిస్తున్నారు. మీ ఒక్కరే నేవిటి ? కావాలంటే యిరుగుపొరుగుల్ని అడగండి.... మాకోసం యిస్తున్నారా ? దేవుడికోసం యిస్తున్నారు. యీబుక్‌లోరాసి సంతకంపెట్టండి"— ఆ బుక్‌లో ఏవో సంతకాలు. వాటి ప్రక్కన అయిదు,ఆరూ పది,ఇలావున్నాయి. అంకెలు ఇవ్వక పోతే 'రగడ'.. దేవుడి మీద భక్తి కాస్త పోయిం దాక్షిణ్యంలో కానీ వాళ్లతో యింటివసంయు గొడవ




ఎవరు పడతారు ? యింటింటికి ప్రోగు చేస్తే పందలవుతాయి వాళ్లకి. పందిళ్లు బాజాలు, గానా బాజాలు అన్నీవస్తాయి కాని, ఆ నాలుగు రూపాయిల తోనే ఆ ప్రతియింట్లోనూ అయ్యో ! వీళ్లకి అవసరంగా యిచ్చామే అన్న దుఃఖం లేకుండా ఆనందంగా ఎంతో అలంకారాలతో పాలవెల్లి తయారవుతుంది . ఒక్క వినాయక చవితికేగాదు వెలకోసారి పేటపేటకీ జంక్షన్‌లలో ఏదోఒక ఉత్సవం తప్పదు! టాక్సులెన్నో రకాలు అవి ప్రభుత్వం వారివి. వాటికో అర్థం ఉంది. కాని యీ ఫంక్షన్ లేదా జంక్షన్ టాక్స్ ఘోరం కదా! జంక్షన్‌లో నిరుద్యోగులై కాలక్షేపం చేస్తూ వారి అలసత్వానికి శిక్షగా ఆ వీధిమధ్య తరగతి వారికి విధించే టాక్సులు నాలుగురోడ్ల జంక్షన్‌లలో ఓ టీకొట్టు (కాకాహోటల్) ఓ మొక్కజొన్నకండెల నిప్పులకుంపటికొట్టు.... సినిమా పాటలతో చెవులు చిల్లులుపాడిచే పబ్లిసిటీ రిక్షా,అయ్యో! హాయిగా దిమిసా దుక్కల్లాగా వుండే కొంత మంది పేటలోని మనుషులూ, వీరికి పండుగలుచేసి, పేట ప్రెస్టేజి ఆ నాలుగురోడ్ల చౌక్‌లో గౌరవం నిలబెట్టటం అలవాటు. దానికోసం మామూలు గృహస్థులంతా



పెట్టుబడి బలవంతంగానైనా పెడితే వాళ్ళ శ్రమ దానంచేసి, పందిళ్ళ గ్రటావేయించి జామ్మని చేసుకుంటారు. ఒక్కోసారి యాంటీసెంటిమెం టయి రాసరే— యీ బాధపడలేక యిలాపేటల్లో జం క్షన్ పూజలు గవర్నమెంటు 'బ్యాన్' చేయకూడదా? అనిపిస్తుంది. ప్రతీయింటి మీదా యీ బలవం తపు "టాక్సు" పడకుండా ప్రతి పండుగకి ప్రతీ అమవాస్యకీ కాపాడమని ఎవర్ని కోరుకోవాలి సామా న్యుడు. సామాన్యుల యింటిముందు.... అల్సేషన్ కుక్కలు, నేపాలీ వాచ్‌మన్‌లు వుండరు కదా? అలాంటిచోట్లకి అసలీ చందా లీడర్‌లు పోనేపోరు కదా! ...

(వి) ●

## రాలిన ముత్యాలు

శ్రీ సోమసుందర్

సంనిధానమా కవిరా భావమూ
అనుకూల దాంపత్యంలా పొసగాలి
ఆనందయోగంలా భాసించాలి
అమృత స్రోతస్వినిలా ప్రసరించాలి

## చలపతి

(11 వ పేజీ తరువాయి)

కాని ఆవేళ మధ్యాహ్నం 'మేనేజరు'కి రిపోర్టు చేయటానికి వెళ్లాడు. ఛండశాసనుడని పేరున్న మేనేజరు చేతిలో ఇక చలపతి పని 'ఆఖరు' అనుకుంటూ వెళ్లాడు.

విషయమంతా విని ఓ చిరునవ్వు నవ్వేశాడు మేనేజరు. "చూడండి రావుగారూ! మీరు చిన్న విషయాన్ని మరీ సీరియస్‌గా తీసుకుంటున్నట్టున్నారు!"

వెంకట్రావు ఆశ్చర్యనుంచి తేరుకుంటూ అన్నాడు. "లేదండీ! చాలా రోజులు అబ్జర్వ్ చేసాక ఫలితం లేకపోబట్టే ఇలాంటి రిపోర్టు వ్రాయవలసి వచ్చింది.........ఒక్కరికి కాదు— ముగ్గురికిలా జరిగింది...మరి"

మేనేజరు ఎప్పుడూ అంత ప్రశాంతంగా కనిపించలేదు. "పోన్లెండి ఈసారికి వాడిని వదిలెయ్యండి. మరోసారి ఇలా జరిగితే నే చెప్తాలెండి.. వీళ్ళతో కొంచెం చూసి చూడనట్టూరుకుంటూ సర్దుకుపోవాలి కాని ... కాగితాల దాకా వస్తే మనకే నష్టం!..."

ఎటువంటి నష్టమో – మేనేజరు వెంకట్రావుకి చెప్పలేదు కాని, ఆఫీసులో ఎవర్నీ సమర్థించని మేనేజరు ఆ పూట చలపతి నెందుకు అంత చక్కగా వెనకేసుకు వచ్చాడో అర్థమయిపోయింది!

వాళ్ళెవ్వరూ పైకి చెప్పకపోయినా ఆ ముగ్గురూ ముప్పతిప్పలు పడి తీర్చిన బాకీ డబ్బంతా 'మేనేజరు'కి చలపతి అప్పిచ్చాడని ఊహించటానికి వెంకట్రావుకి ఏ మాత్రం కష్టమనిపించలేదు! 

# చూడండి
# మామూలు పంపు నీటినుండి కల్మషములను ఫిల్టరుచేసి ప్యూరిటాన్ దానిని త్రాగుటకు ఎలా 100% సురక్షితము చేస్తుందో.

కలరా, టైఫాయిడ్, రక్తవిరేచనములు,
గాస్ట్రో-ఎంటెరైటిస్ మొదలైన నీటి ద్వారా సంక్రమించే
జబ్బులు రాకుండా ఇంతకంటె మరో మంచి హామీ లేదు.



1. పై గదిలో పంపు నీరు పోయాలి.
2. లాబొరేటరీలో పరీక్షించ బడిన కాండిల్ నీటిలోని సూక్ష్మజీవులన్నిటినీ ఫిల్టర్ చేస్తుంది.
3. అతుకు లేని, రసాయనిక-నిరోధమైన గీతలు పడని, ఇపోక్సీ-పూత వేసిన అల్యూమినియమ్ గది.
4. త్రాగటానికి తయారుగా ఉన్న 100% స్వచ్ఛమైన నీరు క్రింది గదిలో జమ అవుతుంది.



ప్యూరిటాన్ తేలికైనది, పగులనిది. ఒక చోట నుండి మరొక చోటికి తీసుకు పోవటానికి అనుకూలమై, శుభ్రపరచుటకు వీలైనది.



నేడే ఒక ప్యూరిటాన్ తీసుకోండి. మీకు ఆప్తులైన వారి కోసం వాడదగినది.

హెచ్చరిక:
కేవలం అసలైన ప్యూరిటాన్ ఫిల్టర్ని మాత్రమే లభింప చేసుకుంటున్నారన్నది నిర్ధారణ చేసుకోండి. పై గదిపైగల ప్యూరిటాన్ లేబుల్ ఉందో లేదో చూడండి. కాండిల్ యొక్క మెటల్ కేప్ పై ప్యూరిటాన్ పేరు, రిజిస్ట్రేషన్ నంబర్ 196501 కోసం చూడండి

బల్సారా
—సౌఖ్యమైన జీవనానికి అధునాతన సాధనాలు
BALSARA బల్సారా అండ్ కంపెనీ (ప్రై) లి
43, నగీనదాస్ మాస్టర్ రోడ్, బొంబాయి-400 001.

Chaitra-BLS-19 Tel Rev




## హైదరాబాద్ నోట్ బుక్

మహిళా మహోదయం :

ఈ సారి స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా జంటనగరాలలో జరిగిన ఉత్సవాలలో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం వారు రవీంద్రభారతిలో నిర్వహించిన ''మహిళా మహోదయం' కార్యక్రమం బలమా నికమని దానిని తిలకించినవారు ఎవరైనా నిస్సందేహంగా చెప్పగలరు అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా శ్రీ రావూరి భరద్వాజ నిర్వహణలో జరిగిన ఈ 'మహిళా మహోదయం' చాల లవుచిత్యాన్ని సంతరించుకొనడమే కాక ప్రజాళికి మన మహిళల అపూర్వ పురోగతిని ప్రత్యక్షం చేసింది శ్రీమతి మాడపాటి సత్యవతి ఈ సమ్మేళనం ఆవశ్యకతను, ఉద్దేశాలను వివరించిన విధానం, ప్రతి విదుషీమణినెమక్తసరిగా మూడు పంక్తులలో పరిచయం చేసిన విధానం శ్రీమతి రతన్‌ప్రసాద్ ప్రతి విదుషీమణిని మైక్‌వద్దకు సగౌరవంగా పిలుచుకొని రావడం, ప్రసంగానంతరం వారిని వారిస్థానాలకు పిలుచుకొని వెళ్లడం కార్యక్రమానికి నాటకీయతా వైభవం కలిగించాయి నిజాం పరిపాలనపై ప్రత్యేక పరిశోధనలు జరిపిన డాక్టర్ సరోజినీరేగాని, శాతకర్ణితల్లి గౌతమి మొదలు నేటివరకు చరిత్ర నిర్మాతలైన మహిళలను గురించి ప్రసంగించారు శ్రీమతి శ్రీ అమ్మన్నరాజాదొక్కా సీతమ్మ, దుర్గాబాయి ముప్పమ్మ, బ్రహ్మం రాణిలక్ష్మీ బాయమ్మ మొదలు ఎందరో మార్గదర్శకులైన స్త్రీలను గురించి ప్రసంగించగా, శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారి స్వాతంత్ర్యోద్యమంలో స్త్రీలు నిర్వహించిన పాత్రను గురించి తమ సహజగంభీర ధోరణిలో ప్రసంగించారు. తెలంగాణా ఉద్యమంలో మహిళలు రజాకార్ల కళ్లలో కారంకొట్టిన ఉదంతాలను ఉల్లేఖించారు కాళిదాస రచనలపై విశేష పరిశోధన జరిపిన శ్రీమతి వి అనసూయాదేవి సంస్కృత భాషకు శతాబ్దాల నుండి సేవచేసిన విజ్జిన్, మోరిక, దేవ, వికటనితంబ, గంగాదేవి రంగాజమ్మ మొదలయిన వారిని వివరించారు. హరివంశంలో ఒకొకరికి మిగులు లేకుండా పరిశోధన జరిపి, తెలంగాణా పలుకుబడిని యావత్తు పుక్కిట పట్టినా, అన్ని ప్రాంతాలవారికి అందుబాటులో వుండడానికి గ్రాంధిక భాషలోనే గంగ ఝరిగా ప్రసంగించి శ్రోతలను ముంచెత్తే డాక్టర్ పాకాల యశోదా తిరుమలరెడ్డి సుందర గంభీర గ్రాంధిక శైలిలో ప్రాచీన తెలుగు రచయిత్రులు మొల్ల, తాళ్లపాక తిమ్మక్క మొదలయిన వారిని గురించి చెప్పారు పత్రికా పాఠకులకు తమ రచనలద్వారా చిరపరిచితురాలయిన శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి మన పత్రికా రచనా చరిత్రను దిఙ్మాత్రంగా తెలిపి, అలనాడు అనసూయ, చిత్రాంగి పత్రికలను నిర్వహించిన సత్యవతి మొదలైనవారిని గురించి తెలిపారు జానపద సాహిత్యం పరిశోధన విషయమైనా, కథానికలలో, వచన కవితారచనలో విశిష్టస్థానం సంపాదించిన డాక్టర్ నాయనికృష్ణకుమారి ఆధునిక స్త్రీ కవితా వ్యాసంగంపై ప్రసంగిస్తూ చావలి బంగారమ్మ మొదలైన వారి సేవను తెలిపారు తమ అసంఖ్యాక నవలలతో పాఠక లోకాన్ని ముంచెత్తుతున్న శ్రీమతి మాదిరెడ్డి సులోచన మహిళల రచనల్లో సాంఘిక దృక్పథాన్ని గురించి చెప్పారు మట్టిబొమ్మలు, సమత వంటి విప్లవాత్మక నవలలతో తెలుగు వారి గుండెకు నిండు వెలుగునిచ్చిన కుమారి వాసిరెడ్డి సీతాదేవి స్త్రీలు— సినిమా రచన అన్న విషయమై ప్రసంగిస్తూ, స్త్రీలు ఎంతో ఆవేశావేగాలతో అనుభవంతో రచించిన రచనలు సినిమా నిర్మాతల చేతుల్లో పడిదశావతారాలెత్తి, ''ఇవి మా రచనలేనా?'' అని రచయిత్రులు విస్తుపోయే పరిస్థితిఏర్పడిందన్నారు సమాచార ప్రచురణ శాఖ డైరెక్టరు శ్రీమతి శ్రీరాజ్యంసిన్హా, పరిపాలనవ్యవస్థలో గణనకెక్కిన స్త్రీలను గురించి చెప్పగా, శ్రీమతి కృష్ణవేణిసంజీవయ్య శాసన సభా వ్యవహారాలలో గణనకెక్కిన మహిళలను గురించి చెప్పారు. సుప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి ఆనందారామం అధ్యాపక వృత్తిలో స్త్రీల సాధక బాధకాలను గురించి ప్రసంగించి శ్రోతలను నవ్వేట్లు చేశారు సుప్రసిద్ధన్యాయవాదిని శ్రీమతి కె. అమరేశ్వరి న్యాయవాదవృత్తిలో విఖ్యాతలైన మహిళను గురించి డాక్టర్ సుందరీకృష్ణ వైద్యవృత్తిలో వాసికెక్కినడాక్టర్ లాజరస్, శ్రీమతి వి. ఎం. నాయుడుమొదలయిన వారి

చేయు వాసిని గురించి కీర్తించారు. ప్రముఖ సంగీత విద్వాంసురాలు శ్రీమతి ఎం. పద్మజ గాంధర్వ విద్యలో స్త్రీల పాత్రను వర్ణిస్తూ, చామర్తి లక్ష్మీనరసమ్మ, గుడిపూడి ఇందుమతీ దేవి వంటి వాగ్గేయకారలను గురించిచెప్పారు. చివర ప్రముఖ సినిమానటి శ్రీమతి జమునా రమణారావు చలనచిత్ర నాటక రంగాలలో ప్రేక్షకులను ఉర్రూతలూపించిన మహిళలను గురించి చెప్పారు. "ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం ప్రసారించిన మహిళా మహోదయం కార్యక్రమం ఇం టితోసమాప్తం. నిర్వహణ రావూరి భరద్వాజ" అని వినగానే తన్మయులై వింటున్న శ్రోతలు ఉలిక్కిపడి గడియారాలు చూచుకొన్నారు. గంటన్నర నిమిషమున్నరలాగ గడిచిందే— అనుకున్నారు.

**ఉపశ్రుతి :**

ఒక విఖ్యాత రచయిత్రి —ఏమండీ నిన్నటి సమావేశంలో మహా మంచి వ్యాసం చదివారు. చాల బాగుంది. ఎవరు వ్రాసిచ్చారేమిటి?

రెండవ విఖ్యాత రచయిత్రి: చాల బాగుందా? ధన్యవాదాలు. మొన్న మీరేడియో ప్రసంగంవిన్నాను. చాల రమ్యంగా చదివారు. ఎవరిగొంతుకండీ ?—

—తిరుమల రామచంద్ర

# గణపతులెందరు?

(6వ పేజీ తరువాయి)

గణపతుల సంఖ్య నాలుగు నుండి ఆరింటికి పెరిగింది.

తర్వాత ఈ సంఖ్య ఎనిమిదింటికి పెరిగింది. లక్ష్మీ గణపతి, క్షిప్ర గణపతి, సిద్ధి గణపతి, చింతామణి గణపతి, శక్తి గణపతి, ఏకాక్షర గణపతి, కుమార గణపతి, ఉచ్ఛిష్ట గణపతి – ఆ అష్ట గణపతులు! వెనుకటివారిలోని ఉచ్ఛిష్ట గణపతి మాత్రం ఇందులో గ్రహించబడినాడు. తక్కినవారందరూ కొత్తవారే!

గణపతుల సంఖ్య తర్వాత ద్విగుణీకృతమైనది. పదహారుగురు గణపతులు తయారైనారు

1. బాలగణపతి– ఇతనికి నాలుగు చేతులు. గణపతి భోజనప్రియుడుగదా! బాల గణపతికి పండ్లంటే ఇష్టం. నాలుగు చేతులలోనూ మామిడి, అరటి, పనసపళ్లు, చెరుకు ముక్కలూ పట్టుకొని ఉంటాడు. 2. తరుణ గణపతి– ఆరు చేతుల విగ్రహం. వివిధ ఫలాలను ధరించి ఉంటాడు. 3 భక్త గణపతి– ఇతడు చతుర్భుజుడు. భక్తులర్పించే మామిడి, అరటిపళ్లను, పాయస పాత్రను, నారికేళాన్ని ధరించి ఉంటాడు. 4. వీర గణపతి– ఇతడు వీరుడుకాబట్టి ఖడ్గం, గద, శక్తి మొదలైన ఆయుధాలను ధరించి ఉంటాడు. 5. శక్తి గణపతి– ఇతనికి రెండే చేతులు. వాటితో పాశాంకుశాలను పట్టుకొని ఉంటాడు 6. ధ్వజగణపతి – ఇతడు చతుర్ముఖుడు. కమల, పుస్తక, అంకుశాయుధాలను ధరించి ఉంటాడు. 7. సిద్ధి గణపతి– ఇతనికీ నాలుగు భుజాలే ఇతను మోదక ప్రియుడు. నాలుగు చేతులలోనూ కమలాన్నీ, రసాల ఫలాన్నీ, చెరకునూ, మోదకాలను ధరించి ఉంటాడు. 8. ఉచ్ఛిష్ట గణపతి– వీణను, దానిమ్మ పండ్లను, కమలాన్నీ ధరిస్తాడు. 9. విఘ్నరాజ గణపతి– ఇతడూ చతుర్భుజుడే. ఇతని వాహనం మూషికం. 10. క్షిప్రగణపతి – ఇతని ఆకారం త్వరగా లేస్తున్నట్లు ఉంటుంది. 11. హేరంబ గణపతి– ఇతనికి ఐదుముఖాలు, పది చేతులు ఉంటాయి. వాహనం సింహం. 12. లక్ష్మీ గణపతి– ఇతనికి ఎనిమిది భుజాలు. సిద్ధి, బుద్ధులతో కూడి ఉంటాడు. 13. మహా గణపతి– ఇతనికీ అష్టభుజాలే 14. విజయ




గణపతి– ఇతడూ అష్టభుజుడే. కల్పవృక్షపు నీడను ఆసీనుడయి ఉంటాడు. 15. నృత్త గణపతి– ఇతడు చతుర్భుజుడు. నాట్య భంగిమలో ఒక్క పాదంపయి నిలిచి ఉంటాడు. 16 ఊర్ధ్వగణపతి– మీదికి లేస్తున్నట్లుంటాడు ఆరు భుజాలు ఉంటాయి

ఈ షోడశ సంఖ్యతో కూడా మన వారికి తృప్తి కలుగలేదు. గాణాపత్యుల పూజా విధానం అష్టావింశతి (ఇరవై ఎనమండుగురు) గణపతులను తెలియజేస్తున్నదట!

రుద్రాయ మాల అనే గ్రంథంలో ముప్ఫయి యిద్దరు గణపతుల రూపాలు వర్ణితాలై ఉన్నవట!

గణపతి ప్రణవ స్వరూపుడు. ప్రణవంలో అకారం మొదలుకొని ఉకారం వరకూ ఏభై ఒక్క అక్షరాలున్నవి–అందువల్ల అతనికి ఏభై యొక్క రూపాలున్నవని కొందరిఅభిప్రాయం.

శ్రీనాథ మహాకవి కాశీఖండంలో ఢుంఢి గణపతిని గురించి చెప్తూ, అతడు 'ఏబదియు నారు మూర్తుల వెనక మెసగి– .. కాశికాపురి రక్షించుచుండు'నని చెప్పియున్నాడు. ఈ విధంగా గణపతుల సంఖ్య క్రమ క్రమంగా పెరిగిపోతూ వచ్చింది

ప్రధాన దైవతమైన గణపతి భక్తుల పద్ధతుల ననుసరించి ఎన్ని రూపాల నయినా ధరించవచ్చును. గణపతికి కాశీ, రామేశ్వరాదులవలె సుప్రసిద్ధాలైన క్షేత్రాలు లేకపోయినా, దేవాలయాలు అసంఖ్యాకంగా వున్నాయి కొన్ని పట్టణాలలో పేట కొక గుడి చొప్పున, అధికంగానూ కూడా కానవస్తున్నవి.

హిందువుల ప్రధాన క్షేత్రమైన కాశీలో, మొదట ఢుంఢి గణపతిని సేవించిన తర్వాతనే విశ్వేశ్వరుని దర్శనం చేసుకోవాలనే సంప్రదాయం ఉన్నది.

"అంగీరస"







## రాగవీచికలు

(18వ పేజీ తరువాయి)

మీరు నిలబడేదాకా ఆదుకోడం ఎవరికి తప్పినా మాకు తప్పదు కదా ... ఆ బాధ్యత మాత్రం మా కప్పగించి వెళ్లిపోయింది' కళ్లొత్తుకున్నారు మహాలక్ష్మమ్మగారు.

'అవునమ్మమ్మా ... పెట్టే బాధ్యతున్న వారికి అనే హక్కులు కూడ వుంటాయి. వుండాలి కూడ...కానీ యిప్పుడు చూడు ... నా పరీక్ష పోడానికి నేనొక్కడినేనా కారణం? సంవత్సరమంతా పోయినా అప్పు పుస్తకాలు కొనలేదుకదా ... పైగా ఎలాగో సర్దుకోమని తిట్లు ... ఎవరు మాత్రం ఎన్నాళ్లిస్తారు? పరీక్షల ముందొపరిస్తారు?... మీ తాతగారికి డబ్బుందిగా ఆ మాత్రం పుస్తకాలు కొనలేడా? అంటారందరూ ... అలా మీతో అంటే యేమన్నావుందా...మధ్యలో చెడిపోయిన వాడిని నేను...అన్నయ్యకి రాసినా డబ్బు పంపును ... మీ గౌరవం కోసం వూరుకోబట్టి నా పరీక్ష పోయింది ... ఎవర్నని యేం లాభం' లేచి కళ్లు తుడుచుకుని వీధిలోకి విసురుగా వెళ్లిపోయాడు వాసు...

'అవునవునుక్కొ పంపించును ... వాడికే తిండానికి మెతుకుల్లేవన్న సంగతి తెలియకుండా వుంది వీడికి... వాడుపంపే పాతికలో యిద్దర్నెవరు పెంచుతారో నేహా చూస్తా. రేపే పుత్తరం రాసి పిల్లని తీసుకెళ్లమని చెప్తాను...' అని తన మాటలు విన్పించుకునే

# రాగవీచికలు

వారు ఎవరూ లేకపోడంతో అంత టితో ఆగారు మాధవరావుగారు.

## *18*

సాయంత్రం అయిదు గంటలు దాటి పావుగంటైంది... ఆఫీసంతా యించుమించు ఖాళీ అయిపోయింది... రజనీకాంత్, అతనితో పాటు మరో యిద్దరు సైంటిఫిక్ అసి స్టెంట్లు మిగిలిపోయారు ... పొద్దుటనించి సతమతమౌతున్నా ఒక్క ఫార్ములా అంతు పట్టటంలేదు .. ఇక బయల్దేరుదామనుకుం టుండగానే ఫోను మ్రోగింది.

అవతలి స్త్రీ కంఠాన్ని ముందు పోల్చుకో లేకపోయాడు. తర్వాత ఆనందంతో వుక్కిరి బిక్కిరై 'నువ్వా వర్ధనీ యేమిటి విశేషం' అన్నాడు.

'యేంలేదు... అయ్యగారు ఆఫీసులోనే వున్నారో మరెక్కడైనా తప్పిపోయారేమోనని'

'తప్పిపోతానని ఎవరు చెప్పారు నీకు.'

'లేకపోతే మరేమిటి? ఆఫీస్సై అరగంట కావస్తున్నా మీ దర్శనం లేకపోతేనూ.'

'యూ...సిల్లీ ... ఇదిగో వచ్చేస్తున్నా... ఎంతసేపైందేమిటి నువ్వొచ్చి '

'సరిగ్గా అయిదు నిమిషాలక్రితం... మరో అయిదు నిముషాలు చూస్తానంతే ఓ కే' ఫోను పెట్టేసింది వర్ధని.

ఈ మధ్య తరచు రజనీకాంత్ దగ్గిర కొస్తూందా అమ్మాయి... పిచ్చాపాటీ మాట్లాడటం... యేవో నాలుగు నవలలు పట్టుకెళ్లటం అలవాటైపోయింది.

'అది సరే... యేమిటో అమ్మాయిగారు చాల తొందరలో వున్నారు' అన్నాడతను వచ్చి వర్ధనికెదురుగా కూర్చుంటూ.

'యేముందీ... మామూలుగా రాణి దగ్గర కొచ్చి యిటొచ్చా... పుస్తకాలేమైనా యిస్తా రని.'

'అంతేకాని నాకోసం కాదంటావ్.'

'మీకోసమని మీతో చెప్పాలా.'

'పోనీ మరెవరితోనైనా చెప్పావా.'

'పోదురూ... మీకెప్పుడూ వున్న తొందరే'

'యేం తప్పా.'

'పెళ్లికాకుండా తప్పుకాదూ.'

'పెళ్లికోసమే యీ తొందరైతే తప్పేలా గౌతుందీ '

'యేమో బాబూ... నాకు మాత్రం తొందరలేదు... పైగా భయంగా కూడా వుంది.'

'భయమెందేనికీ... మీ తాతయ్య గురించేనా'

'ఆయన విషయమెలా వున్నా మిగతా విష యాలు మాత్రం చాల గజిబిజిగా ఉన్నాయి.'

'మీతోకాక మరెవరితో మనసిప్పి చెప్ప గలను' తలొంచుకుంది.

క్షణంసేపు ఎవ్వరూ మాట్లాడలేదు.

'ఆనందరావేమంటున్నాడు?' టాపిక్ మార్చాలనే ప్రయత్నంలో రజనీకాంత్ మొదలు పెట్టాడు.

'యేముందీ మామూలే... నే ననుకున్నది ఆయ్యేంతవరకూ భయం తప్పదు. ఈ విష యంలో నేను కొంచెం తొందరపడ్డానేమోనని కూడ అన్పిస్తోంది' అంది.

ఆమాటా యీమాటా మాట్లాడి వెళ్లి పోయింది వర్ధని.

* * *

భోజనం చేసి వంటింట్లో పని చూసు కుని గదిలోకి వచ్చేసరికి తొమ్మిది దాటింది. తలుపు దగ్గరగా వేసి మంచంమీద పడు కుంది వర్ధని – ఆలోచన లొక్కటొక్కటీ మనస్సును స్వాధీన పర్చుకుని చికాకు చేస్తున్నాయి.

తన విషయమే ఎప్పుడెలా ఎవరితో చెప్పాలా, అసలు సానుకూల పడేదేనా అని ఒక వంక భయపడుతూంటే అటు ఆనంద రావు విషయంలో జోక్యం కలిగించుకుంది–







ఎంతైనా మగవాడు—ఈ రోజు ఆలోచిస్తా నన్నాడు. రేపేదో నిర్ణయానికొచ్చి నాకిష్టం లేదని తప్పించుకుంటే అటు రాణిని అనవస రంగా చిక్కుల్లో పెట్టింది అవుతుంది—యెది యేమైనా తనీ విషయంలో తొందర పడిందేమొ—

ఇలా వుండగా మరోపక్క యింటర్ రిజల్ట్స్ వస్తే యేదో ఉద్యోగం సంపాదించు కుని అన్నయ్యకు తోడుగా వుండి సంసారాన్ని ఓ కొలుక్కి తేవాలనుకుంటోంది— తన పెళ్ళి ప్రసక్తిగాని లేస్తే యిక రెండో ఆలో చనకు స్వస్తి చెప్పాల్సిందే—

ఆలోచన్ల ధాటికి తట్టుకోలేక టేబిల్ పై నున్న నవల నందుకుని నాలుగు పేజీలు తిరగవేసింది — మనసు చికాకుకు గురి అయి

వపుడే మంచి పుస్తకాల అవసరం తెలిసేది !

పుస్తకంలోనుండి జారిన మనియార్డర్ కూపన్ మనసును మరో మార్గంలోకి లాగి ప్రశ్నార్థకంగానే మిగిలిపోయింది. ఏవరీ కవిత?

ఆవిడకు, రజనీకాంత్‌కు గల సంబంధ

## రా గ పీ చి క లు

మెటువంటిది? అసలామెకు నెలనెలా యెందు కీయన డబ్బు పంపడం ?

మొదట్లో ఒకసారి చూసింది– మళ్లీ యిప్పుడు– అప్పటికీ యిప్పటికీ పంపేడబ్బులో మార్పుకన్పిస్తోంది–ఉద్యోగస్తుడయ్యాకకాస్త ఎక్కువగానే పంపుతూవున్నాడన్న మాట !

తనకు తెల్సినంతవరకూ అతని పై ఆధార పడిన బంధువు లెవరూ లేరు– అయితే

అజీర్ణం
వల్ల మీరు
భయపడుతున్నారా?

**హ్యూలెట్స్
మిక్స్చర్
తీసుకొని -
తిరిగి తినడం
ప్రారంభించండి**




సి జె హ్యూలెట్ & సన్
(ఇండియా) ప్రైవేట్
లిమిటెడ్
మద్రాసు 600 002,
కలకత్తా 700 001

SAA/CJH/1191



ఆరోగ్య, అనారోగ్య
పరిస్థితులలో
మహిళలు ఆధారపడునది
ఆరోగ్య సౌభాగ్యములకు
70 సంవత్సరముల పైగా
ప్రసిద్ధినొందినది.

**లోధ్ర**



**కేసరి కుటీరం
(ప్రైవేటు) లిమిటెడ్**
రాయపేట, మద్రాసు-14

ఏజెంట్లు సీతారామ జనరల్ స్టోర్సు (ఏజన్సీస్)

---

అందరికీ అవసరమైన
పుస్తకాలు

1. ఇంగ్లీషు సంభాషణ కళ
ఇంగ్లీషు మాట్లాడాలని కుతూహలపడే వారికి చాలా ఉపయోగకరమైన పుస్తకం. తెలుగు వివరణతో కూడినది.
వెల రు. 4—25, పోస్టేజి రు 1—70

2. చక్కని తెలుగు రాయడమెలా ?
తెలుగు భాషను చక్కగా రాయడానికి కావలసిన విషయాలన్నీ వివరించబడ్డాయి కథానికా రచన గేయ రచన, లేఖా రచన మొదలగు విషయాలు వివరించబడ్డాయి
వెల రు. 3—50, పోస్టేజి రు. 1—50

3. జానపద కళాసంపద
రచన : ఆచార్య తూమాటి దోణప్ప.
వెల రు. 8- 00, పోస్టే రు 1—80

జనహిత పబ్లికేషన్స్.
రాయనగర్, గన్నవరం, కృష్ణాజిల్లా(ఎ పి )

---

**జీవితంలో ఆనందాన్ని, ఆహ్లాదాన్ని కలిగించే అనేక మధుర క్షణాలుంటాయి**



# తలనొప్పి మూలంగా మీ ఆనందాన్ని పాడుచేసుకోవద్దు

**2 ఆస్ప్రో తీసుకోండి**




మైక్రోఫైన్ ఆస్ప్రో నొప్పిని
అతిశీఘ్రంగా తొలగించును




AG 63 TL

ఈమె యెవరు ?

ఎవరన్నా కావచ్చు—అది తన కనవసరంకానీ ంచూయనెందుకు తనతో చెప్పలేదు ? ఇలా అనుమానాలతో దూరమై మనసును చిత్ర వధకు గురిచేసే కంటె సూటిగా అతనినే

## రా గ పీ చి క లు

అడిగేస్తే.... ? ఆ నిర్ణయం కూడా అట్టే సేపు నిలవలేదు—

ఆయనను నిలదీసి అడిగే హక్కు తన కెవరిచ్చారు ? సమయమొస్తే అదే బయట పడుతుంది. అనుకుని నిట్టూర్చింది.

ఆ రాత్రంతా కలత నిద్ర— ఎప్పుడుకళ్ళు తెరిచినా ఒకటే ప్రశ్న—

కవిత ఎవరు ? (ఇంకా వుంది)




Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

# అందుకోండి హాయినిగూర్చే తాజాదనం




సింథాల్ టాయిలెట్ పౌడరు చికాకుపెట్టే శరీర దుర్గంధమునుండి రక్షణకూర్చి, ఎంతో వేడిగా ఉన్న రోజున కూడా మిమ్మల్ని తాజాగా ఉంచుతుంది. ఆహా! ఎంతో ఆహ్లాదాన్ని కలిగించే సువాసన... మీ తోనే నిలిచే సువాసన.

గోద్రెజ్ వారి

**సింథాల్**

Interpub/GSP/12/74 Tel



శ్రీరామకృష్ణా ఆర్ట్స్

# వైకుంఠపాళి

నిర్మాత: ఎమ్.రామకృష్ణారెడ్డి B.E. దర్శకత్వం: కె.బాపయ్య

పాటలు: ఆత్రేయ సంగీతం: కె.వి.మహదేవన్

లక్ష్మీ ఫిలింస్

